ఓం

# యుగావతారము



రచన:

శ్రీ శ్రీ శ్రీ అనుభవానందస్వామి

మరియు

శ్రీ శ్రీ శ్రీ మాతాజీత్యాగీశానందపురి




ప్రచురణము

పరమహంస కార్యాలయము

భీమునిపట్నము - 531 1 8

విశాఖ జిల్లా

షష్ఠమ పుష్పము

ప్రథమ ముద్రణము : 1985

వెల : రు. 6-00



ప్రతులకు :

- పరమహంస కార్యాలయము
  భీమునిపట్నము - 531 163 (విశాఖ జిల్లా)
- అనుభవానంద గ్రంథమాల
  బాపట్ల - 522 101 (గుంటూరు జిల్లా)

ముద్రణ



ఓం

# ఉపోద్ఘాతము

సర్వధర్మ సమన్వయావతారమైన శ్రీరామకృష్ణ పరమహంస దేవునిమూర్తిని ఎన్నిసార్లు చూచినా యింకా చూడాలనే ఉంటుంది. దానికి కారణం ఆయన ప్రశాంతమూర్తిమత్వమే! ఆయన జీవితాన్ని ఎన్నిసార్లు చదివినా యింకా చదవాలనే ఉంటుంది. దానికి కారణం ఆయన చేసిన అద్భుత సాధనలలోని ప్రత్యేకతయే। ఆయన కీర్తనలను ఎన్నిసార్లు పాడుకున్నా యింకా పాడుకోవాలనే ఉంటుంది. దానికి కారణం ఆయన మనలను మేల్కొలుపుతున్నట్లు ఉండటమే! ఆయనను ఎన్నిసార్లు జపించినా యింకా జపించాలనే ఉటుంది. దానికి కారణం ఆయన త్యాగమయ జీవితం। త్యాగం త్యాగం త్యాగం అని ప్రబోధిస్తున్నట్లే ఉంటుంది. త్యాగం లేనిదే, భోగపరిత్యాగం చేయనిదే ఆధ్యాత్మిక అనుభవం అలభ్యంసుమా అని హెచ్చరిస్తున్నట్లు ఉంటుంది. అందువలననే ఆయన జీవితం ఎంతమంది ఎన్నిసార్లు వ్రాసినా ఏవేవో నూతన భావములు స్ఫురించి, హృదయానికి ఆహ్లాదాన్ని కలిగిస్తుందనడంలో అతిశయోక్తిలేదేమో। పదే పదే ఆయనను తదేకంగా వీక్షిస్తూ, స్మరిస్తూ, జపిస్తూ, ధ్యానిస్తూ ఉంటే ఈర్ష్యాసూయాదులు పరుగులు వేయవలసిందే। కాని అవి యథార్థ జపధ్యానాదులు కావాలి.

శ్రీ అనుభవానందస్వామి విద్యార్థిదశలోనే శ్రీరామకృష్ణదేవుని జీవితం చదివి, ఆయనను ఆదర్శంగా పెట్టుకున్నారు. ఆ సమయంలోనే 'శ్రీరామకృష్ణాంజలి' అని ఒక శతకం వ్రాసుకున్నారు. తర్వాత దేశాలు తిరుగుతూ 'శ్రీరామకృష్ణ లీలాసంకీర్తనం' అని కొన్ని కీర్తనలను వ్రాసుకున్నారు. ఆపైన శ్రీరామకృష్ణుని పేరుతో ఆశ్రమ ద్వయం నిర్మించారు. ఆ తర్వాత ఆ ఆశ్రమములలో శ్రీ శారదా

రామకృష్ణుల విగ్రహములను తాము స్వయంగాచేసి ప్రతిష్ఠించారు. అంత 'శ్రీరామకృష్ణపూజ' పేరుతో అష్టోత్తరశత, సహస్రనామావళిని వ్రాశారు. అటుపై 'శ్రీరామకృష్ణాదర్శనం' వ్రాశారు. 'శ్రీరామకృష్ణుని గూర్చి దేశదేశాలు తిరిగి ఉపన్యాసరూపంలో ప్రచారం చేసారు. చివరికి 1973లో శ్రీరామకృష్ణదేవుని చేరుకున్నారు.

ఆవిధంగా శ్రీ స్వాములవారు వ్రాసిన పాటలను పాడుకుంటూ, పద్యాలను చదువుకుంటూ ఉండగా శ్రీ స్వాములవారు వ్రాసిన పాటలు పద్యాలతోనే శ్రీరామకృష్ణుని జీవిత చరిత్ర వ్రాయాలనిపించింది. కొన్ని పాటలలో కొన్ని చరణాలను, 'శ్రీరామకృష్ణాంజలి' 'శ్రీదక్షిణేశ్వరీ స్తవం' లోని కొన్ని పద్యాలను తీసుకొని, మధ్య మధ్యలో చిన్న వ్యాఖ్యానం వ్రాస్తూ వచ్చాను. దీనిని శ్రీరామకృష్ణ జీవితకథాగానంగా కూడా పాడుకుంటూ చెప్పుకోవచ్చునని నా ఉద్దేశము. పాఠకులు దీనిని పఠించి, గానం చేసుకుని, సర్వదేవదేవీ స్వరూపునిగా, సర్వమత సమన్వయమూర్తిగా, సర్వసాధనానుభవకోటికి నిర్వచన, వివరణ రూపనిఘంటువు అయిన శ్రీరామకృష్ణపరమహంస దేవుని అనుగ్రహాన్ని పొందెదరుగాక.

మా తాత్రి

త్యాగీశానంద

---

" ఈ గ్రంథముద్రణమునకు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వమువారు రు. 1800-00 లు ఇచ్చి ప్రోత్సహించినందుకు సంతోషము.

ఓం

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ

# యుగావతారము

ధర్మోద్ధారక జగద్గురో జయ
శ్రీరామకృష్ణా నమో నమో
సర్వమతంబుల సామరస్యమను
శాంత్యుపదేశంబవసరమగుటన్
కృష్ణుడు రాముడు బుద్ధ శంకరులు
క్రీస్తు మహమ్మదులేకరూపమున
విశ్వమానవ సౌభ్రాతృత్వము
సుస్థిరపరచెను రామకృష్ణుడై

ఒక్కొక్క దేశంలో, ఒక్కొక్క కాలంలో, ఒక్కొక్క మహా పురుషుడు జన్మిస్తూ ఉంటాడు. మతాలు అనేకం అయినా ఆ మతాలకు ఆధారమైన ధర్మం ఒక్కటే అనే పరమ సత్యాన్ని తెలియజేయటానికి, సర్వమత సమన్వయం కలిగించటానికి, సర్వ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధించటానికి శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణ పరమాత్మ, శ్రీ బుద్ధ భగవానుడు, శ్రీ శంకరాచార్యుడు, శ్రీ ఏసుక్రీస్తు, శ్రీ మహమ్మదుల

ఏకరూపముతో ఒక సర్వావతారమూర్తి, సర్వ అనుభవమూర్తిగా శ్రీరామకృష్ణ పరమహంస దేవుడు జన్మించాడు. అందుచేతనే అవతారవరిష్ఠుడై 'సర్వసాధన సంయుక్తం సర్వ ధర్మ సమన్వయమ్। సకలానుభవ సంపన్నం రామకృష్ణం నమామ్యహం॥' అని శ్రీరామకృష్ణ దేవుడు కీర్తింపబడుట ఎంతయో ఆనందదాయకం.

మహాపురుషులు అందరికీ జన్మింపరు. ఆ మహద్భాగ్యం అందిరికీ కలుగదు. పూర్వపుణ్య పరిపక్వంవలన ఆ మహాత్ములకు తల్లిదండ్రులు కాగలుగుతారు. ఆ దివ్యాత్ములను ఎత్తుకుని లాలించే అదృష్టం అందరికి రాదుగదా!

పిత ఖుదిరాముడు మాత చంద్రమణి
బ్రాహ్మణ శ్రేష్ఠులు పరమ పవిత్రులు
అనవరతము రఘువీరు గొల్చుచును
అనుపమభక్తి చెలంగిరి ధన్యులు

అను రీతిగా రామభక్తి తత్పరులు, పవిత్రమూర్తులు, బ్రాహ్మణోత్తములు, సకల సద్గుణోపేతులు అయినవారు ఆ దంపతులు. ఆ బ్రాహ్మణుని పేరు ఖుదీరామ ఛటోపాధ్యాయ. అయన ఇల్లాలి పేరు చంద్రామణీదేవి. ఈ దివ్య దంపతులే మన శ్రీరామకృష్ణ దేవుని జననీ జనకులు. ఆహా! ఏమి భాగ్యం!

శ్రీరామకృష్ణుని తండ్రి ఖుదీరాముడు రామోపాసకుడు, సత్యసంధుడు, నిరాడంబరుడు, ధర్మరతుడు. ఖుదీరాముడు దర్యపూరు నివాసి. కాని ఆ ఊరి జమీందారు అయిన రామానందరాయ్ ప్రజలను అన్యాయంగా బాధించేవాడు. ఆ జమీందారు ఒకనిపై ఒక అసత్యపు వ్యాజ్య

మును తెచ్చి, దానికై అబద్ధపు సాక్ష్యాన్ని చెప్పించటానికి ఖుదీరాముని పిలిపించాడు. కాని శ్రీరామచంద్రుని యథార్థంగా ఉపాసన చేసిన ఖుదీ రాముడు తన సత్యమార్గాన్ని వదలటానికి అంగీకరించలేదు. వెంటనే జమీందారు కోపంతో ఖుదీరాముని ఆస్తినంతయు తీసికొనెను. దానికిని ఖుదీరాముడు చింతింపక, భగవదనుగ్రహంగా భావించి, తాను ధర్మావ లంబకుడైనందుకు పొంగిపోయాడు, అవును. మానవునికి మానవత్వం ముఖ్యం. ధర్మాత్ముడికి ధర్మం ముఖ్యం. నియమావలంబకుడికి నియమం ముఖ్యం. అందువలననే ఖుదీరాముడు తన సత్యనిష్ఠను వదలలేదు. జీవితంలో ఒక గమ్యాన్ని నిర్ణయించుకుని ప్రయాణం సాగించేవారికి అది సాధ్యమేమో?

పైవిధంగా, నిర్లిప్తుడైన ఖుదీరాముడు కట్టుబట్టతో, భార్యాబిడ్డ లతో, తన జీవనాధారమైన దశరథరామునితో దర్యపురాన్ని వదలి ప్రయాణం సాగించాడు కాలినడకన. ఎక్కడికి? అటి నిరాడంబర మూర్తు లకు ముందుగానే సమస్తం ఏర్పాటు జరిగే ఉంటుంది. అది వారి ఉపా సనా పటిమ అనకతప్పదు.

ఖుదీరామునికి సుఖలాల్ గోస్వామి అని ఒక స్నేహితుడున్నాడు. అతడు కమార్పుకూరు నివాసి. ఖుదీరాముని సల్లక్షణాలను చూచిన ఆ స్నేహితుడు, ప్రతిదినం ఖుదీరాముని చూడవచ్చుననే సంకల్పంతో తన ఊరికి రమ్మని, అక్కడే ఉండమని ఆహ్వానిస్తూ ఉండేవాడు. ఆ అవ కాశం నేటికి దొరికింది మన ఖుదీరామునికి. ఆ గోస్వామి ఆహ్వానాన్ని గ్రహించుకొని ఖుదీరాముడు కమార్పుకూరు చేరి స్నేహితుని కలుసు కున్నాడు. ఆ స్నేహితుడుకూడ ఎంతో ఆనందంతో తన స్నేహితునికి తగిన వసతుల నేర్పాటు చేశాడు. మన శ్రీరామకృష్ణుని జననం యీ

గ్రామంలోనే. శ్రీరామకృష్ణుని బాల్యక్రీడల చూచి ఆనందించే భాగ్యం ఆ గ్రామవాసులదే! ఆ మహద్భాగ్యం దర్శపురవాసులకు కలుగలేదు గదా!

ఈ విధంగా కమార్పుకూరు చేరిన ఖుదీరాముడు, మరల తన పూజాదికము నిర్వర్తించుకుంటూ, ప్రాపంచిక విషయాలకు దూరుడై, ప్రశాంతంగా జీవనం సాగిస్తున్నాడు. కాని ఖుదీరామునిలో ఏదో అసంతృప్తి కలుగసాగింది. కాశీయాత్ర చేయాలని, త్రోవలో గయా క్షేత్రాన్ని దర్శించి, తన పితృదేవతలకు పిండప్రదానం చేయాలని, అది తన కర్తవ్యమని భావించాడు ఖుదీరాముడు. నాటికి ఆయన వయస్సు 60 సంవత్సరాలు. అయినను జంకులేక పాదచారియై యాత్రలకు బయలుదేరాడు ఖుదీరాముడు. మంచి విషయాలలో పట్టుదల మానవుడికి శాంతిని కలిగిస్తుంది. కాని చెడు విషయాలలో పట్టుదల అశాంతిని చేకూరుస్తుంది. ఎంత వ్యత్యాసం!

వృద్ధుడైన ఖుదీరాముడు తన వృద్ధాప్యాన్ని మరచినవాడై కాలి నడకన గయకు చేరుకున్నాడు. పితృదేవతలకు పిండ ప్రదానం చేసుకుని ఋణవిముక్తుడయ్యాడు. బడలికతో నిద్రించాడు ఖుదీరాముడు. ఆ నిద్రలో ఆయనకు ఒక దివ్య స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో గయాధిదేవతయైన శ్రీ మహావిష్ణువు గోచరించాడు. 'నాయనా! ఖుదీరామా! నేను నీగృహంలో జన్మిస్తాను' అని చెప్పి అంతర్ధానం అయ్యాడు. వెంటనే ఖుదీరాముడు మేల్కొని 'ఇది నిజమేనా? నన్ను భగవానుడు యీ రూపంలో అనుగ్రహించి, ఆయనను సేవించుకొనే భాగ్యం నాకు కలిగిస్తున్నాడేమో!' అని తన కులదైవం రామచంద్రుని తలచుకొని పొంగిపోయాడు. ఈ విషయాన్ని ఎంతో ఆనందంగా తన సహధర్మ

చారిణియైన చంద్రామణీదేవికి తెలియజేయాలనుకున్నాడు ఖుదీరాముడు. తర్వాత కాశీకి వెళ్ళి, విశాలాక్షి విశ్వనాథుల దర్శించి, గంగాస్నానం చేసికొని, తిరిగి కమార్పుకూరికి బయలుదేరాడు ఆయన.

అదే సమయంలో, కమార్పుకూరులో నివసిస్తున్న చంద్రామణీ దేవికి ఒక అద్భుత సంఘటన జరిగింది. ఖుదీరాముని యింటి సమీపం లోనే ఒక చిన్న దేవాలయం ఉన్నది. ఆ శివుని దర్శించాలని చంద్రా మణీదేవి దేవాలయంలో ప్రవేశించింది. ఆమెకు తోడుగ ధని అను ఒక కమ్మర స్త్రీ ఉన్నది. ఆలయంలో ప్రవేశించిన చంద్రామణీదేవిలో శివలింగమునుండి ఒక తేజస్సు బహిర్గతమై, ఆమె గర్భంలో ప్రవేశించి నట్లు గోచరించింది చంద్రామణికి. వెంటనే ఆమె స్పృహ కోల్పోయి నది. ప్రక్కనున్న ధని, ఆమెకు తగిన ఉపచారం చేసి యింటికి తీసు కొని వెళ్ళింది. పిదప తాను గర్భవతినని చంద్రామణీదేవికి స్ఫురిం చింది. ఈ విధంగా శ్రీరామకృష్ణుని జననం శివకేశవుల అభేదత్వాన్ని సూచిస్తున్నది. అందుచేతనే ఆయన అభేదత్వాన్ని బోధించగలిగాడేమో!

సాధుజనసంరక్ష సంకల్పమును దాల్చి
సాకారమును బొందు సంప్రదాయమున
శ్రీ గదాధర దేవ! వైకుంఠమును వదలి
శ్రేష్ఠావతారమున వెలగినావే!

భగవానుడు సాధురక్షణార్థం లోకంలో జన్మిస్తూ ఉంటాడుగదా! ఎవరిమీద అనుగ్రహం కలుగుతుందో ఎవరికెరుక? ఖుదీరాముని అను భవంతో శ్రీ మహావిష్ణువు, చంద్రామణీదేవి అనుభవంతో ఈశ్వరుడు ఏకరూపులై జన్మించటం భారతదేశంయొక్క మహద్భాగ్యం. ఆ పుట్టేం

దిన మూర్తి సకల అనుభవస్వరూపుడై, సర్వ సమన్వయత్వాన్ని వ్యక్తం చేయటం భారతీయుల అదృష్టం అనకతప్పదు.

పదునెన్మిది నూర్ల ముప్పదియారున
పదునేడవ తేది ఫిబ్రవరీనెల
వంగరాష్ట్రమున కమార్పుకూరున
మంగళకర దీప్తులతో జనించెను

1836 వ సంవత్సరం, ఫిబ్రవరి 17 వ తేదీ అనగా ఫాల్గుణ శుద్ధ విదియనాడు మన శ్రీరామకృష్ణుని అవతరణం జరిగింది. రాత్రి చీకటిని పారద్రోలి వెలుగును ప్రసాదించటానికి సూర్యభగవానుడుదయించినట్లుగా అజ్ఞానాన్ని నశింపజేసి జ్ఞానాన్ని ప్రసరింపజేయటానికి యీ ఆధ్యాత్మిక జ్ఞానభాస్కరుడుకూడా ఉదయించాడు మానవాళికి. అమంగళత్వాన్ని దూరం చేయటానికి మంగళమూర్తియై ఉద్భవించాడు, శిశువుకు గదాధరుడని నామకరణం జరిగింది.

జోలపాటలకు బోరు పెట్టును
కాళి పాటలకు గురకిబెట్టును

సామాన్యంగా, తల్లి జోలపాటలకు పిల్లలు నిద్రిస్తారు. కాని యీ చిన్ని గదాధరుడు మామూలు జోలపాటలకు పోరు పెట్టేవాడు. అవును, లౌకిక జీవితం నడిపేవారికి యీ లాలిపాటలుగాని అలౌకిక గమ్యాన్ని పొందనున్న ఆ పసి గదాధరుడికి యీ పాటలు బాధ కలిగించేవేమో; తల్లి చంద్రామణి కాళికాదేవి కీర్తనలను పాడేది. లోకాన్నంతా నిద్రింప జేసే ఆ జగన్మాత పాటలను, నిర్మలమూర్తి అయిన తన తల్లి పాడటం

ప్రారంభించగానే గదాధరుడు గురకపెట్టి నిద్రించేవాడట! పువ్వు పుట్టగానే పరిమళించటం సహజమేగదా!

ఏడవనెలలో నూయల నూపుచు
పాడుచున్న తన మాతృదేవికి
గడ్డ మీసముల భావి రూపమును
గాంచజేసె నత్యద్భుతలీలన్॥

చంద్రామణీదేవి ఒకసారి పసిబిడ్డను ఊయలలో నుంచి, కాళికాదేవిని స్తోత్రం చేస్తూ, ఊపుచున్నది. ఊపుతూ ఊపుతూ ఆమె ఊయల లోనికి చూచింది. భయభ్రాంత అయింది. శిశువు స్థానంలో కాషాయ వస్త్రధారి, ఆజానుబాహుడు, గడ్డమీసములు గల ఒక వ్యక్తిని చూచింది. 'అమ్మా! ఇది నా భావిజీవిత రూపంసుమా!' అన్నట్లు చిన్ననాడే తన మాతృమూర్తికి వ్యక్తం చేశాడు గదాధరుడు. మహాత్ముల బాల్యలీలలు అత్యద్భుతం.

కాని బాల్యమున వ్యక్తమైన దివ్యానుభూతులు భావి జీవితంలో యథార్థమైతేనే వారు మహాత్ములుగా పరిగణింపబడతారు. లేకున్నచో అభూత కల్పనలు అవుతాయి. కల్పించుట యన్నచో అసత్యముచెప్పుట అని అర్థం. ఆధ్యాత్మిక మార్గంలో సత్యం మొదటిమెట్టు. కాన యీ కల్పనలు ప్రథమ సోపానాన్నికూడా ఎక్కనీయవని అర్థం అన్నమాటే! కల్పించటం సులభమే కాని ఆ అనుభవాలు తర్వాతి జీవితంలో ఆచరణకు రావటం కష్టం. అందువలననే ప్రచారాలు వేరు, నిజ జీవితం వేరుగా ఉంటున్నవి నేటి ప్రపంచంలో.

ఈ విధంగా కాలం గడచిపోతున్నది: మన గదాధరుడికి ఐదు సంవత్సరాలు వచ్చాయి. చక్కని రూపం, దానికి తోడు నిర్మల ప్రవర్తన ఉన్న ఆ బాలుని చూడనిదే ఆ గ్రామప్రజలు ఉండలేకపోయే వారు, అక్షరాభ్యాసం చేశారు లోకంతీరుగా. కాని గదాధరుడికి యీ లౌకికవిద్యపై బుద్ధి నిలిచేది కాదు. అవును. అక్షరమైన విద్యతో అక్షరుని గ్రహించుకోవాలనుకునేవాడికి యీ అక్షరాలు, అక్షరాభ్యాసాలు దేనికి? అయినా పాఠశాలకు వెళ్ళి కొద్దిగా చదవటం, వ్రాయటం నేర్చుకున్నాడు. తన సహచరులకు తన సాహచర్యాన్ని కలిగించటానికో, లేక తనవంటి విద్యార్థికి అట్టి ఉపాధ్యాయుడున్నాడని ఆయనకు గొప్పదనాన్ని కలిగించటానికో పాఠశాలకు గదాధరుడు వెళ్ళి ఉంటాడేమో।

బాలుర జేర్చుచు రాధాకృష్ణుల
భక్తి గీతముల బాడి మైమరచు
కృష్ణుడనేనని యానందించును
రాధిక నేనని తన్మయుడగును.

పాఠశాలకు బోయి, తోటి విద్యార్థులతో దైవనామ స్మరణతో, భక్తితత్పరుడై ఆడుచు, పాడుచు దైవధ్యానంతో కాలం గడిపేవాడు చిన్ననాటి గదాధరుడు.

కృష్ణమేఘమున శ్వేతపక్షులను
గాంచి మైమరచు నేడవ ఏటను

ఏడు సంవత్సరాల ప్రాయం వచ్చింది గదాధరుడికి. పాఠశాలకు వెళ్ళిరావటం, తండ్రి చేస్తున్న పూజాదికాలను చూస్తూ ఉండటం, తాను పూజా అర్చనాదులను చేయాలని కుతూహలపడటం గదాధరుడికి సహజం అయ్యాయి.

ఒకదినం సాయం సమయంలో బాల గదాధరుడు పొలంగట్టుపై నడిచి వెళ్లుతున్నాడు. ఆ సంధ్యా సమయంలో, అస్తమిస్తున్న సూర్యుని చూస్తున్నాడు, అంతలో నల్లని మబ్బు కమ్మింది. పైగా ఒక్క ఉరుము కూడా ఉరిమింది. ఒక్క మెరుపు మెరిసింది. ఆ ఉరుముశబ్దానికి ప్రక్కనే ఉన్న చెట్లపైన కొంగలు భయంతో ఆకాశంలోకి ఎగిరి, బారులుతీర్చినట్లు వెళ్లుతున్నవి. ఆ దృశ్యాన్ని చూచాడు చిన్ని గదాధరుడు.

మ॥ గురుడా! ఏడవ ఏట క్షేత్రముల బఙల్ గృష్ణమేఘంబుపై
దిరుగాడన్ గని, కృష్ణ దర్శనమునన్ దివ్యంబు పూర్ణంబు భా
స్వరమౌ భావసమాధిభాగ్యము ప్రపంచాతీతమై పొందవే
పరమాత్మా! క్షుదిరామపుత్ర! గురుదేవా! రామకృష్ణప్రభూ!

ఆ నల్లని మేఘం శ్రీకృష్ణునిగా, ఆ తెల్లని కొంగల బారు నంద నందనుని మెడలోని ముత్యాలహారంగా కనిపించింది గదాధరుడికి. తన్మయత్వం చెందాడు. ఆనందంలో మేను మరిచాడు. అదియే ప్రథమ సమాధిస్థితి, బాల్యమున నాడు ప్రారంభమైన సమాధి సంస్థితులు తర్వాతి కాలమున సహజములై యొప్పారి ఆయనను అనిర్వాచనీయానందమున ముంచెత్తినవి. అవి యథార్థ సమాధ్యనుభవములు!

గదాధరుడు చిన్ననాటి నుండి మంచి చురుకైనవాడు. చక్కని జ్ఞాపకశక్తి, కమనీయమైన రూపం ఆ బాలునిలో వ్యక్తం. 9వ వత్సరం లోనే ఉపనయనం పొంది, వంశ పారంపర్యంగా వస్తున్న శ్రీ రఘు వీరార్చన సాగించేవాడు. పుట్టుకతోనే రావాలి ఏదైనా. వృద్ధాప్యంలో రావాలంటే రావు. చిన్నతనంలో మనస్సు, శరీరం మానవుని స్వాధీనంలో ఉంటాయి. వార్ధక్యంలో మానవుడు వాటి స్వాధీనంలో ఉంటాడు. అందుచేతనే 'బాలకులుగారె తొల్లిటి భాగవతులు' అన్నారు.

గదాధరుడికి 10 సంవత్సరాలు వచ్చాయి. శివరాత్రి పుణ్యదినం వచ్చింది. ఆరోజు గదాధరుడు ఉపవసించి, శివ దర్శనాకాంక్షతో కనులు మూసికొని, ఒక గదిలో ధ్యానమగ్నుడై యున్నాడు. తనను పిలువ వద్దని తల్లికి చెప్పి కూర్చున్నాడు. సాయంకాలం అయింది. మంచినీళ్ళు త్రాగటానికికూడా బయటకు రాలేదు చిన్ని గదాధరుడు.

ఆ మహా పర్వదినమున, ఆ కమార్పుకూరు గ్రామానికి 'శివలీలలు' అనే నాటకాన్ని ప్రదర్శించటానికి ఒక నాటక కంపెనీవారు ఆ దినం వచ్చారు. కాని అనుకోనట్లుగా శివ పాత్రధారికి జ్వరం వచ్చింది. నాటకం నిలిచిపోతుందేమో అని భయం చెందుతున్నారు కంపెనీవారు. అట్టి సమయంలో, ఆ ఊరివారికి ఏకసంధాగ్రాహి యగు మన బాల గదాధరుడు జ్ఞప్తికివచ్చి ఖుదీరాము నింటికివచ్చి గదాధరునిగూర్చి ప్రశ్నించారు. కాని తల్లి యగు చంద్రామణి తన బిడ్డ విషయం తెలియజేసింది. గదాధరునివద్ద బాగా చనువున్న కొద్దిమంది ఆ బాలుని గదిలోనికి బోయి, ధ్యాన నిమగ్నుడైన బాలుని లేపి, పరిస్థితిని దెలిపి, రమ్మని పట్టుబట్టిరి. వెంటనే గదాధరుడు వారి వెంట బయలుదేరి వెళ్ళెను. శివ వేషాన్ని ధరింపజేశారు. పులి చర్మం కట్టారు. శరీరంనిండా విబూది పూశారు. జటాజూటం కట్టారు. పైన అర్ధ చంద్రాకారంలో చంద్రుని పెట్టారు. మెడలో రుద్రాక్షమాలలు వేశారు. ఒక చేతిలో త్రిశూలం పుంచారు. వేరొక చేతిలో ఢమరుకం పెట్టారు. మూడవ నేత్రాన్నికూడా అమర్చారు, ఒక్కసారి తన ఆ శివస్వరూపాన్ని చూచుకున్నాడు గదాధరుడు. 'శివోహం' అంటూ, ఆ శివతత్త్వంలో లీనమయ్యాడు. బాహ్యస్మృతి కలుగలేదు. నాటకానికి వచ్చిన ప్రజానీకం ఆ బాల శివుని గాంచి తన్మయులయ్యారు. నాటకం నిలిచిపోయింది. నిజమే! యథా

ర్థంగా శివత్వం పొందినవానికి యిక యీ ప్రపంచ నాటకం పరిసమాప్తి అయినట్లేగదా! నాటకం వేసేవారందరికి యిట్టి దివ్యానుభవం కలుగదు గదా! అదే జరిగితే అందరూ మహాత్ములవుతారు. అప్పుడు తగాదాలే ఉండవు.

మ॥ శివవేషంబును దాల్చి. జ్ఞానమయమౌ చిద్రూపమున్ జూచి మా
నవలోకంబున సర్వమున్ మరచి జ్ఞాననందుడౌ శంకరున్
అవలోకించుచు నైక్యమున్ గనెడు బ్రహ్మానందసంశోభితా!
భవదీయాంఘ్రులకేను మ్రొక్కెదను దేవా! రామకృష్ణప్రభూ!

అనురీతిగా శివతత్త్వవిభూతితో ఆనంద రసాస్వాదన చేస్తూ మూడు దినములుండి పోయాడు బాల గదాధరుడు. అహా! ఇట్టి దివ్యానుభూతి ఎల్లరకు సాధ్యమా? కాదు. ముమ్మాటికీ కాదు.

గదాధరునికి పితృవియోగం సంభవించింది. ఇది గదాధరుని చిన్ని మనస్సులో చెరగని ముద్ర వేసింది. లోకంలో ఉన్న అనిత్యత్వాన్ని చిన్ననాడే గ్రహించింది ఆ పసి మనస్సు. ఇదివరకు కంటె పూజాధ్యానముల నెక్కువ చేసుకున్నాడు. ఏకాంతంగా కూర్చుని, ఏదో ఆలోచనలో మునిగిపోయేవాడు.

షోడశవర్ష ప్రాయుడయ్యాడు గదాధరుడు. లౌకికవిద్యా విముఖుడుగా ఉన్నాడు. ఇటువంటి గదాధరుని గాంచిన పెద్దన్న రామకుమారుడు చింతించి, తల్లితో చెప్పి, తమ్ముని కలకత్తాకు తీసుకొని వచ్చాడు. రామకుమారుడు మహా విద్వాంసుడు. కలకత్తా నగరంలో ఒక చిన్న సంస్కృత పాఠశాలను నడుపుకుంటున్నాడు. అందుచేతనే తమ్ముడిని

చదివించటానికి తీసుకొని వచ్చాడు. కాని యిక్కడకూడా గదాధరుడు యీ విద్యపై ఆసక్తి చూపకుండెను. దీనిని చూచిన రామకుమారుడు 'నాయనా! విద్యలేనిచో నీవెట్లు బ్రతుకగలవు? విద్యవలన అంతా సాధ్యమే. నేటినుండి నీవుకూడా చదువుకో' అని తమ్ముని చిన్నగా మందలించాడు.

పొట్టకూటి చదువులకో జన్మము
పట్టుదలతో మాయిని జేయుటకో!
వ్యర్థవిద్యలకు నన్వేషించిన
బ్రహ్మపరము చేకూడునె యన్నా?

'భగవంతుని చేర్చేది విద్య. మిగిలినవన్నీ పొట్టకూటికే. అవన్నీ అవిద్యలే సుమా!' అని గదాధరుని సమాధానం. ఆ సమాధానం హృదయంలో నుండి వచ్చింది. ఆ సమాధానం సూటిగా వెళ్ళి రామకుమారుని హృదయంలో దృఢంగా నాటుకున్నది. జ్ఞాననేత్రం తెరుచుకుంది. ఆనంద బాష్పాలు ప్రవహించాయి. ఆనందం పొంగి ప్రవహించింది. వాత్సల్యంతో హృదయం నిండిపోయింది. ఆ తమ్ముడిని గాఢాలింగనం చేసుకున్నాడు. 'నాయనా! నేను యింతకాలం యీ లౌకిక విద్యలో మునిగి భగవానుని విస్మరించాను. చిన్నవాడివైనా సత్యాన్ని పలికావు. ఈ మాట అందరికీ రాదు. నీ పూర్వజన్మ సుకృతం. నీవు దైవనామ స్మరణ చేసుకో. నీకెట్టి ఆటంకాన్ని కలిగించను తమ్ముడూ!' అని మాట యిచ్చాడు తమ్ముడికి,

ఇక మన గదాధరుని శ్రీరామకృష్ణునిగా వ్యవహరిద్దాం, ఇక ఆయన జీవితం కాళికార్చనతో ప్రారంభం కానున్నదిగదా!

ఇదే సమయంలో కలకత్తాకు నాలుగు మైళ్ళ దూరంలో గల దక్షిణేశ్వరంలో సత్సంస్కారవతియు, దేవీభక్తురాలును, జమీందారిణియు అయిన రాణీరాస్మణి గంగాతీరంలో ఒక పెద్ద కాళీ ఆలయాన్ని కట్టించింది. ఆ మూర్తి ప్రతిష్ఠకోసం రామకుమారుడు దక్షిణేశ్వరానికి వెళ్ళి, ప్రతిష్ఠ చేయించాడు. అంత ఆ జమీందారిణి కోరికపై కొంతకాలం భగవతి అర్చనకొరకు దేవాలయింలో అర్చకుడిగా ఉన్నాడు. ఆ సమయంలోనే శ్రీరామకృష్ణుడు అన్నగారి కోసం దక్షిణేశ్వరం వెళ్ళటం, గంగా స్నానం గావించుకొని, ఈశ్వరుని విగ్రహం తయారుచేసికొని, పూజించుకొని, ఆ మూర్తిని పూజానంతరం గంగలో వేసి, తిరిగి కలకత్తాకు వచ్చేవాడు. రాణీరాస్మణి అల్లుడైన మధురనాథుడు చాటుగా యీ విషయాన్ని చూచేవాడు. శ్రీరామకృష్ణుని రూపం, భక్తిశ్రద్ధలు మధురనాథుని ఆకర్షించాయి. ఒకరోజున మెల్లగా శ్రీరామకృష్ణుని చేరి, శ్రీకాళికాదేవ్యాలయంలో పూజ చేయమని ప్రార్థించాడు: కాని శ్రీరామకృష్ణుడు అంగీకరించలేదు. మధురనాథుని మనస్సు మాత్రం రామకృష్ణుని అర్చకునిగా ఏర్పాటు చేయాలని ఉవ్విళ్ళూరుతున్నది. అప్పుడప్పుడు తన కాంక్షను బయటపెట్టుతునే ఉన్నాడు మధురనాథుడు.

మధురనాథుని అదృష్టమో అనునట్లు ఒకరోజు మధురుడు రామకృష్ణుని గాంచి మరల అభ్యర్థించాడు. వెంటనే రామకృష్ణుడు 'అమ్మవారి ఆభరణముల బాధ్యతగాక పూజా బాధ్యతను మాత్రమే నేను తీసుకుంటాను, ఇది నీకు సమ్మతమా?' అని ప్రశ్నించాడు. అవకాశాన్ని జారవిడుచుకుంటాడా మధురుడు! వెంటనే అంగీకరించాడు. బాగా ఏడుస్తున్న పసివాడికి తల్లి నగలెన్ని చూపినా వాడికి కావలసినది తల్లియే గాని నగలు కావు. అదేవిధంగా రామకృష్ణుడికి కావలసినది జగన్మాత

అర్చనాదులే కాని ఆమె ఆభరణాలు కావేమో! అంతేకాక భక్తి జ్ఞాన వైరాగ్యాలకుమాత్రమే ప్రాముఖ్యంగాని, యీ నగలకు లేవేమో! 'కామకాంచనాలకు దూరంగా ఉండండి. మానవుని పతనానికి యీ రెండే కారణం. మోక్షాసక్తులు వీటిని దూరం చేయండి' అని భావి జీవితంలో ఎలెత్తి చాటనున్న శ్రీరామకృష్ణుడు ఆ యాభరణాల బాధ్యతపైన వేసుకొనలేదేమో! ప్రచారకునికి ఆచరణ ముఖ్యంకదా! అదే శ్రీరామకృష్ణుని జీవితంలో గోచరిస్తుంది, ఆచరణహీనుడు ప్రబోధకుడు కాదు, గురువు కాడు.

లోకంలో ధనవంతులు, జమీందార్లు చాలామంది ఉంటారు. కాని వారి ధనం సద్వినియోగం కావటం అనేది వారివారి పూర్వజన్మ సుకృతం మీద ఆధారపడి ఉంటుందిగదా! దర్యపూర్ జమీందారు అక్రమ సంపాదనకై శ్రీరామకృష్ణుని తండ్రి యగు ఖుదీరాముని అబద్ధపు సాక్ష్యం కొరకు పిలిపించి, అసత్య పలుకలేదనే అహంకారంతో ఊరినుండి వెళ్ళగొట్టాడు ఖుదీరాముని. ఈ సంఘటన ఖుదీరాముని జీవితంలో వైరాగ్యాన్ని, పెంపొందింపజేసింది. అదేవిధంగా జమీందారిణి రాణీరాస్మణి దైవభక్తితో భవతారిణీ ఆలయాన్ని నిర్మింపజేసినదై, అందు దివ్యమాతను ప్రతిష్ఠింపజేసి, అచ్చటకు శ్రీరామకృష్ణుని కమార్పుకూరునుండి రప్పించుకొన్నది. ఆమెకాదు రప్పించుకొన్నది. ఆమె పవిత్ర భక్తి. ఆమె హృదయస్థమైన జగన్మాత. అది ఆ లోకమాతయొక్క సంకల్పం. ఆ జమీందారిణీ నిరహంకారియై శ్రీరామకృష్ణుని సేవించుకొన్నది. తాను ధన్యురాలైంది. అంతేకాక ఆయనను సేవించుకొనే భాగ్యాన్ని, ఆయనకు సర్వ వసతుల నేర్పాటు చేసి, ఆయనతో కలిసి తిరిగే అవకాశాన్ని తన అల్లుడైన మధురనాథుడికికూడా అందించిన ధన్యజీవి, త్యాగశీలి, పూతచరిత రాణీరాస్మణి. తన పేరును శాశ్వతంగా ఉంచుకొన్నది. ఇట్టి

అవకాశం ఏ కొద్దిమందికో ప్రాప్తిస్తుంది. ఈ దేవాలయ ప్రవేశమే శ్రీ రామకృష్ణుని జీవితానికి నాంది పలికింది! ఈ దేవాలయంలో జగన్మాతకు చేసిన పూజలే ఆయనకు దేవీదర్శన భాగ్యాన్ని ప్రసాదించాయి. ఈ దేవాలయ ప్రాంగణంలో చేసిన సాధనలే ఆయనను అవతారవరేణ్యునిగా చేశాయి! ఈ దేవాలయ ఆవరణలోనే ఆయన వివేకానంద స్వామివంటి శిష్యరత్నాల్ని తయారుచేసి జగద్గురువయ్యాడు! ఆయన యిచ్చట చేసిన దివ్య ప్రసంగాలే శ్రీరామకృష్ణ బోధామృతం అయ్యింది! ఇచ్చటనే ఆయన సర్వమత సాధనల సలిపి సర్వమత సామరస్యాన్ని ప్రకటించింది! అందుచేతనే సర్వులకు ఆ దక్షిణేశ్వరం పుణ్యక్షేత్రమైంది. అహా! ఏమి అదృష్టం! ఏమి భాగ్యం!

రామకృష్ణుడు కాళికాలయంలో అర్చకుడిగా చేరాడు. భగవద్దర్శనానికై తపిస్తున్న రామకృష్ణునికి యిది ఒక సువర్ణావకాశమై, తర్వాత ఆయన జీవితం సువర్ణ ఫలకంమీద సువర్ణాక్షరాలతో వ్రాసే అవకాశం ఏర్పడింది అనకతప్పదు.

ఇక రామకృష్ణుని పూజావిధానం చూద్దాం. ఆలయంలోని కాళికా మూర్తి దక్షిణముఖంగా ఉండి దక్షిణేశ్వరి అయింది. ఉదయ సాయం కాలాలలో రామకృష్ణుడు భక్తితో దేవిని అర్చించేవాడు. కొంతకాలం పూజాదికాలన్నీ సక్రమంగా సాగాయి. కాని యిక వీని నన్నింటిని ఒక పద్ధతిలో కొనసాగించలేకపోయాడు రామకృష్ణుడు. కారణం ఆ భగవత్ దర్శనం కోసం ఆవేదన! ఆ దివ్యమాత ప్రేమకై తపన! ఆ జగన్మాతను చూడటంకోసం అమితమైన దుఃఖం! ఇక పూజాదులు సాగలేదు ఆయనకు.

అది సహజమే గదా! దుఃఖం అధికం అయితే చేయవలసిన పనులన్నీ నిలిచిపోతాయి. అదేవిధంగా సంతోషం అధికం అయినా అన్ని పనులు స్థంభించిపోతాయి. రామకృష్ణునికికూడా అతి దుఃఖం వల్ల అర్చనాదికాలు నిలిచిపోయాయి.

దేవాలయంలో దక్షిణేశ్వరీ విగ్రహం ముందు కూర్చుని, అమిత ఆవేదనతో యీ విధంగా ప్రార్థించేవాడు.

పాహిమాం శ్రీ దక్షిణేశ్వరీ పాపవినాశిని పాహిమాం
పాహి ప్రణవనాదబ్రహ్మము పాహి మాయీ కాళికా!
విశ్వకారణి విశ్వపోషణీ విశ్వనాశని పాహిమాం
విశ్వరూపిణి సూత్రధారిణి వందే మాయీ కాళికా!

అన్నీ మరచి, దేవిని తదేకంగా చూస్తూ, ఆమెను గానం చేస్తూ, ఆమెనే స్మరిస్తూ, సర్వ ప్రపంచ సృష్టి స్థితి లయకారిణిగ ఆమెను భావిస్తూ కూర్చునేవాడు రామకృష్ణుడు.

నీవె కాదె విశ్వములను నిర్మించుట పోషించుట
నిరవధికా సర్వశక్తి నిర్మల గుణగణసహితా
నాదబిందు కళ సంపద నర్తనచతురాంబ కాళి

అంటూ ఆ జగదంబను నాదబిందుకళాస్వరూపిణిగా కీర్తించేవాడు.

జనని కాళిక ప్రణతులమ్మా! స్మరణ సేతును నిత్యమమ్మా!
కరుణపాలన సేయుమమ్మా! జ్ఞానమయివమ్మా! జ్ఞానమయివమ్మా!
జగతిగాంచిన కన్నతల్లివి, జీవజగతికి కల్పవల్లివి
జనన సంస్కృతినెల్లనెల్లవు సకల గుణవతివి
జ్ఞానమయివమ్మా! జ్ఞానమయివమ్మా!

అనీ ఆ ప్రసన్నమూర్తిని కన్నతల్లిగా, కల్పవల్లిగా విశ్వసించి ప్రార్థించేవాడు. అమ్మా! మూర్తిత్రయాన్ని సృజించావు. వారికి మరల శక్తిత్రయాన్ని ప్రసాదించావు. వారిద్వారా యీ జగన్నాటకాన్ని చేయిస్తున్నావు. కాని మూలాధారం నీవేలే అమ్మా!

ఉ॥ శ్రీగుణమైన సత్త్వమున సృష్టిని ప్రేమ లయించినావు, ఆ
పై గొని రాజసంబు పరిపాలన ప్రేమతో జేసినావు, ఉ
ద్వేగ తమంబున జగతి ప్రేమ సృజించితివమ్మ, కాన నీ
వే గద సృష్టిమూలము వివేకముతో గన దక్షిణేశ్వరీ!

అమ్మా! నీవు త్రిగుణములతో కూడినదానివి. అందుచేతనే సృష్టిని సక్రమంగా నడుపగలుగుతున్నావు. నీవు ప్రేమమూర్తివని, నా తల్లివని నమ్ముకున్నానమ్మా!

త్రికరణముగ నమ్మినాడ నీ చరణాంబుజ సేవల
త్రిగుణరహిత సదయహృదయ త్రాహి శ్రీ భవతారిణి

అమ్మా! నీ పాదాలను త్రికరణశుద్ధిగా నమ్ముకున్నాను. నీవు దయామూర్తివికదమ్మా! నీవు భవసాగరాన్ని తరింపజేసి రక్షించేదానవు.

నీ పదపంకజ సేవా భాగ్యమె నిరతము గోరితి దేవీ
నీ ముఖదర్శన తోషణ రుచిలో నిలువగ నుంటిగ రావే....

అమ్మా! నాకు కావలసింది నీ దర్శనభాగ్యమే. నేను నిన్ను కోరేది అది ఒక్కటే. నీవు అనుగ్రహించి దర్శనం యిస్తే నీ చిరునవ్వు చిందే ముఖాన్ని చూస్తూ ఆ ఆనందంలో నిలిచిపోతాను.

ఎన్ని పూజలను చేసినగానీ ఎంత ధ్యానమొనరించినగానీ
కొన్పింపవు నా తల్లి యదేమొ కిన్క వహించితె మాయీ నాపై

అమ్మా! నీ కోసం అలమటించిపోతున్నానే! నీ కోసం ఎన్ని పూజలు చేశానమ్మా! ఎంత ధ్యానం చేశాను? అమ్మా! నాకు ఎందుకు కనిపించవు? మాయీ! నాపై నీకు కోపమా? తల్లికి బిడ్డపై కోపమా? నీవు ప్రేమమయివమ్మా!

ఎన్నాళ్ళు వెతకినను నిర్మలరూపా! ఎన్నాళ్ళు తిరిగినను
ఎన్నాళ్ళు జపియింపనెన్నాళ్ళు ధ్యానింప
సున్న యగుటయు నిజము నిన్ను గానని జన్మ

అమ్మా! యింకా ఎంతకాలం నిన్ను జపిస్తూ కూర్చోటం? ఎంత కాలం జపతపాలను సల్పినా నాకు ఫలితం శూన్యమేనా? ఎందుకు నిన్ను దర్శించలేకపోతున్నాను! ఈ జన్మకు నీవు నాకు కనిపించవా అమ్మా!

ఈవిధంగా విలపిస్తూ ఉన్న రామకృష్ణుడికి ఒక సందేహం కలిగింది. 'దేవి చేతనమా లేక అచేతనమా? ఆమె చేతనమూర్తి అయినచో నా బాధ ఆమెకు తెలియదా? నా ఏడుపు వినిపించదా?' అని అనుకుని దేవి వద్దకు వెళ్ళాడు.

మాయికి ప్రాణము కలదో లేదో యని ముక్కు క్రింద తన
ప్రేలిని బెట్టును

కాళికాదేవి విగ్రహం ముక్కు క్రింద తన ప్రేలిని ఉంచిచూచాడు రామకృష్ణుడు. ఆ మహానుభావుడికి ఆమెయొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములు గోచరించాయి. ఉలిక్కిపడ్డాడు. 'అమ్మా! నేను ఎంత పొరపాటు చేశానో

చూడు. నన్ను క్షమించు తల్లీ! నీవే లేకున్నచో నేను ఉండగలనా? నీవు యిక నాకు తప్పక దర్శనం యిస్తావమ్మా' అని ఆ తల్లితో చెప్పుతూ పొంగిపోయేవాడు.'

లోకాన సుఖమెచ్చటిదీ? లోకాన గతి ఎచ్చటిదీ?
లోకాన నీ మూర్తి నిగాంచీ తన్మయతను మది పొందనిదీ
అనుభవసుధలో మునుగనిదీ ఆ యానందంబును గ్రాగనిదీ
విషయాలన్నిటి ద్రోయనిదీ నిర్విషయములో మైమరువనిదీ

'అమ్మా! అసలు ఈ లోకంలో సుఖం ఏదమ్మా? నీ దివ్యమంగళ స్వరూపాన్ని చూచి తన్మయత్వం పొందితేనేగాని సుఖం లేదమ్మా! ప్రాపంచిక విషయాలు దూరం కావాలి. అనుభవంలో మునిగిపోవాలి. ఆ ఆనందాన్ని పొందాలి. అమ్మా! ఈ లోకం, యీ లోకవిషయాలన్నీ అనిత్యమే. నీవుతప్ప అంతా అసత్యమే అనే రహస్యాన్ని తెలుసుకున్నాను. నశించేవి ఎందుకమ్మా? నాకు నిత్యసత్య స్వరూపిణివైన నీవే కావాలి. లోకంలో అందరూ అనుభవించేది సుఖం. కాని లోకమాతవైన నిన్ను దర్శిస్తే కలిగేది ఆనందం. సుఖం క్షణికమైనది కాని ఆనందం శాశ్వతం. ఆ శాశ్వతానంద ప్రదాత్రివైన నీ దర్శనం లభిస్తే నాకు నిత్యానందమేనమ్మా! లోకానికి గమ్యం నీవు. నాకు గమ్యం నీవు. శాంతి ప్రదాయినివి నీవేనమ్మా!

లోకములోన సౌఖ్యము కలదే? లోకకాంక్షలకు నంతముకలదే?
లోకంబనగా మృగతృష్ణేగా! లోకాన్వేషణ వ్యర్థముగా!

అసలు ఈ ప్రాపంచిక జీవితంలో సుఖం ఉన్నదా అమ్మా! ఈ కోరికలకు అంతం వున్నదా? అందుచేత యీ లోకవిషయాల్ని కాం

క్షిస్తూ, వాటిని పెంచుకుంటూ, అనిత్యంకోసం ప్రాకులాడటం వ్యర్థంకదా సృష్టిస్థితి లయకారిణిపై నిన్ను అన్వేషిస్తే ముక్తి లభిస్తుంది. అందు చేతనే నిన్ను చూడాలని ఆవేదన పొందుతున్నాను. అమ్మా! ఇకనైనా నాకు కనిపించు.

భువిలో సౌఖ్యము కలదే యీ పుడమిలో శాంతియు గలదే
ఆ సౌఖ్యసంపద నీవటంచును స్వాంతమున కలదమ్మా!

ఈ లోక సౌఖ్యాలన్నీ అశాంతిదాయకాలే! ఈ సంపదలన్నీ అనిత్యమే! తరగని నిత్య సంపదవు నీవేనమ్మా! అందుచేతనే నిన్ను శరణాగతి పొందటం! అందుచేతనే నీ చరణాల్ని ఆశ్రయించటం!

నిను నే గనకన్ మనగలనే? నీ పదముల యానా
లోకము నా మృగతృష్ణే సౌఖ్యము సున్నేనే

అమ్మా! ఈ అశాంతియుత లోకంలో, యీ అనిత్య సుఖాలలో, యీ చంచల మనస్కులమధ్య నేను ఉండగలనా? నిన్ను చూడకుండా ఉండటం అసాధ్యంగా ఉన్నదమ్మా!

నీ సౌఖ్యము యిల గలదే నీ శాంతము భువిగలదే
నిశ్చయముగ నిటలేదని నీవెనుకనె యరుదెంతును!

అమ్మా! ఈ లోకంలో ముమ్మాటికీ శాంతి లేదమ్మా! యథార్థమైన శాంత్యానందాలు నీ పాద సన్నిధిలోనేనమ్మా!

చ॥ నిను గనగల్గు రోజు నిను నిశ్చలతన్ భజియించురోజు నీ
గుణముల నెంచురోజు నిను గొల్చెడువారల జూచురోజు, నిన్

విని ముదమొందు రోజులు వివేకముతో గన మంచిరోజులై
యనుపమ సౌఖ్యసంపదల హాయి నొసంగెడు దక్షిణేశ్వరీ!

అటువంటి మంచిరోజును నాకు ప్రసాదించమ్మా! ఆ ఆనందాన్ని నాకు ఎప్పుడు కలిగిస్తావో! నీ ప్రేమకిరణం నా మీద ఎప్పుడు ప్రసరిస్తుందో మరి! అంతవరకు నేను ఓర్చుకోవాలా అమ్మా!

ఈ విధంగా దేవి సన్నిధిలో కూర్చుని, ఆహారనిద్రాదుల మాటే మరచి, తనకు ప్రపంచంపై ఉన్న విహ్వ భావాన్ని జగజ్జననికి వ్యక్తం చేసుకున్నాడు రామకృష్ణుడు. తన వైరాగ్యాన్ని బహిర్గతం చేసుకున్నాడు. తన అశాంతినంతా వెళ్ళబోసుకున్నాడు. అయినా ఆ దివ్యమూర్తి ఆయనను అనుగ్రహించలేదు.

ప్రేమమూర్తివగు నాదు మాయివో! ప్రేమహీనవగు మహామాయివో!
మోసగింపులిక మాని చెప్పవే అసువుల దీయక నన్ను బ్రోవవే
నీవుంటివా లేదో విప్పి చెప్పవే నీదు యథార్థము తెలియబల్కవే

అమ్మా! అసలు ప్రేమమయివా? లేక మహామాయా స్వరూపానివా? నీకు అసలు ప్రేమ వుంటే నాకు ఎందుకు కనిపించవు? అసలు నీవు ఉన్నావా? నన్ను మోసం చేయకమ్మా! నేను నీ బిడ్డను కాదా? అని పసిబిడ్డవలె ప్రశ్నించాడు రామకృష్ణుడు కాళికామాయిని.

గురు శక్తినిధానము నీవేగా! కరుణామృతరూపము నీవేగా!
నను జేరగదీవే ప్రేమనిధీ శ్రీ కాళిక జననీ మాం పాహి

అమ్మా! నీవు శక్తి స్వరూపిణివి. కరుణామయివికూడా. నీవు ప్రేమమూర్తివే కాని భయంకరమూర్తివి కాదే! నను నీ సన్నిధికి చేర్చుకొని ఆదరించు తల్లీ!

పావన శుభచరణా శ్రీ జననీ పాతక గుణహరణా భవతరణీ
నీ చరణాంబుజ సేవారతిలో నీ నామములో పరవగవలెనే

అమ్మా! నీవు పాపనాశినివి కదా! నీవు భవసాగరాన్ని దాటించే దానివికూడా! సదా నిన్ను సేవిస్తూ, నీ స్మరణలో సర్వం మరిచిపోయే ట్లు చేయమ్మా!

నా నేరమా నా దోషమా నీ దర్శనము గోరుటే పాపమా
నిను జేరనుండుటే దుష్కార్యమా
పసితనమాదిగ మది నిన్ను నమ్మి, వర్జించి యిహము
విషయావశిన్ ద్రోసి భ్రమముల గోసి, విపర్యయము బాసి
నీ సేవ గోరుటయే పాపమా....

అమ్మా! నేను ఏమి పాపం చేశానమ్మా! చిన్ననాటి నుండి నిన్నే నమ్ముకున్నాను. నీవే నా తల్లివని హృదయపూర్వకంగా విశ్వసించాను. అన్యదైవ స్మరణ చేయలేదమ్మా! ఈ వ్యర్థ లౌకిక విషయాల్ని త్రికరణ శుద్ధిగా వదలివేశానే! నిన్ను దర్శించాలనుకోవటమేనా నేనుచేసిన పాపం? అదేనా అమ్మా నా నేరం? సమాధానం చెప్పమ్మా! ఈవిధంగా నీ బిడ్డను బాధించటం నీకు న్యాయమా అమ్మా!

భక్తుల బ్రోవగలేదా! మును మోక్షము నీయగలేదా?
నా ప్రార్థన నీ చెవి జొరలేదా! నవనీతంబగు హృదయము
కరుగదా॥

అమ్మా! నీవు ఎంతమందిని రక్షించలేదు! వారికి మోక్షంకూడా యిచ్చావే! అసలు నా ప్రార్థనలు నీకు వినిపించటం లేదా? నేను చేసిన ప్రార్థనలన్నీ వ్యర్థమేనా అమ్మా!

కాళికా నీవాడనే కావవే నను పుత్రుని
కలనైన నే నిను మరువనే కృప జూడవే పరమేశ్వరీ॥

1. ప్రేమవాహిని కల్గు నీ హృది బీడువారెనె తల్లిరో।
శరణుజొచ్చినవారి బ్రోచెడు బిరుదు వమ్మైపోయెనా
కలనైన నే నిను....

2. నీవు ప్రేమతో జూచు భక్తుల నే విధిన్ సమమౌదునే
చిన్నబిడ్డగ నన్ను గాంచి చేరదీయవె మాతరో,
కలనైన నే నిను....

అమ్మా। నేను నీ పసిబిడ్డనుకదా। నేను నీకు దూరంగా ఉండలే నమ్మా। వాత్సల్యమూర్తివై నన్ను అనుగ్రహించు. అమ్మా। నేను చదువు కోలేదని నాకు దర్శనం యివ్వటంలేదా?

చ॥ చదివిన బాండితీగరిమ సాధ్యపడున్ యశమున్ ఘటిల్లు, నా
చదువులు నిన్ను జేర్చుటకు జాలవుగా। యది లెక్కలేదు యే,
చదువులు నిన్ను జేర్చుచు బ్రశాంత యశోవిభవమ్ములిచ్చు, నా
చదువుల నేర్పి నీదు ఘనసన్నిధినుంపుము దక్షిణేశ్వరీ।

అమ్మా। లౌకిక విద్యలవల్ల పాండిత్యం వస్తుందిగాని నీ దర్శనం మాత్రం లభించదనే సత్యాన్ని గ్రహించాను. అందుచేతనే ఆ విద్యల్ని దూరం చేశానమ్మా। నాకు కావలసింది నీవుగాని ఆ విద్యలు గాదమ్మా। నిన్ను పొందే విద్యమాత్రమే నాకు కావాలి.

చిన్నప్పుడె నీ చిన్మయ రూపము చింతలుడుగ నే దర్శనమొంద
చింతించెదగాదే దేవీ.... ననుగానరాగదే

అమ్మా! నీ చిన్మయ రూపాన్ని దర్శిస్తే చింతలన్నీ నశిస్తాయి. అందుచేతనే చిన్ననాటినుండి నిన్నే నమ్ముకుని నీకై తపిస్తున్నాను. నీ మీద ప్రేమనే పెంచుకున్నాను, అయినా నేటివరకు నీ దర్శన భాగ్యాన్ని నాకు కలిగించలేదుగదా తల్లీ!

నే నీ భక్తుల జేరనా? నిను తృప్తిగ గొలువన్ లేదా?
సంకీర్తనముల దనియింపన్ లేదా? శరణము జననీ శ్రీ భవతారిణీ!
పిలిచిన వెంటనే రాగదే! ప్రీతి పల్కు ద్రాక్షల బలుకవే!
ఆనందములో నను ముంపన్ రావే! అనుభవజలధీ! శ్రీ భవతారిణీ!

అమ్మా! ఉదయంనుండి సాయంత్రంవరకు నీవద్దనే ఉండి, నిన్నే స్మరణ చేస్తున్నాను! నిన్నుగూర్చే పాడుతున్నాను. నీవుతప్ప నా మనస్సులో వేరొకరులేరమ్మా! 'అమ్మా! అమ్మా!' అని ఆలమటిస్తూ ఏడుస్తు నానే! నీకు హృదయం లేదా అమ్మా? ఒక్కసారి కనిపించు, ప్రేమతో ఒక్క చల్లని మాట మాట్లాడు. 'రారా' అని నోరారా పలకరించు. చాలమ్మా! ఇంతకంటె నేను ఏమీ ఆశించను నీనుండి. నిన్ను దర్శించాలనే కోరికగాక వేరే కోరికలేదుగదా!

పిలిచినను పలుకకున్నావే! ఏలకో కఠినమున్నావే!
చాలికను న్యాయమే వదలా జననిరో దరికి జేర్పగదే!

అమ్మా! ఎన్నిసార్లు పిలిచినా పలకవుగదా! ఇంత కఠినత్వాన్ని వహించావెందుకమ్మా? ఈ అనిత్య ప్రపంచంలో నన్ను ఈ విధంగా వదలటం నీకు న్యాయమా అమ్మా!

ఉ॥ నే నిను బాసి యుంతగలనే పరమేశ్వరి! యిట్టి యన్య దే
శాన అనేక నాత్మ జనసంఘము మధ్య, భయంబు గల్గు మా

యీ! నను బుట్టినంట దవ హృద్భవనంబులో బ్రపం
చాన నభావమైన సుఖసంపదనుంచుము దక్షిణేశ్వరీ!

అమ్మా! నిన్ను వదలి యింకా ఎంతకాలం ఉండాలి? ఇక యిక్కడ ఉండలేను. అమ్మా! నీకు సువిశాలమైన హృదయం అనే భవనం ఉన్నదిగదా! అందులో నాకు ఒక ప్రక్కగా నివసించే భాగ్యాన్ని ప్రసాదించమ్మా! చాలమ్మా!

కానుపింపవే తల్లీ! కారుణ్యముంచగరాదా
కాంక్షింతు నీ ప్రాపే అమ్మా! కాళికా!........

నాలో నిన్ను ఉంచినానే కాళికా భవానీ!
నీలోన నన్ను చేర్చి నిలిపియుంపవే........

అమ్మా! సర్వదా నీ సన్నిధిలో నివసిస్తూ ఉండాలనేగా నా ఆకాంక్ష! అది నీకు తెలుసుగదా! భవానీ! నిన్ను నా హృదయంలో ఏనాడో ప్రతిష్ఠించుకున్నాను. నా సర్వస్వం నీకర్పించాను. నేనే నీ వాడినని చెప్పుకున్నానుగదమ్మా! కాని నీవుమాత్రం నన్ను నీలో చేర్చుకోవటంలేదు. అదే నా అశాంతికి కారణం అని నాకు అర్థం అయింది. నేను పిలవటమేగాని నీవు నాతో పలకవుకదా! ఇక నీవే దయతలచి నన్ను నీదరికి చేర్చుకోవాలమ్మా!

దివ్యమైన రూపుతోడ దిశలు నిండు తేజముతో
ప్రేంపులేని ప్రేమతోడ తేనెలొల్కు పల్కులతో, దయజూడవమ్మా!

అమ్మా! నీవు తేజోమూర్తివై. అనంత ప్రేమమూర్తివై, నాకు కనిపించు. ఒక తీయని మాట మాట్లాడు. ఏదమ్మా నీ అనంతమైన వాత్సల్యం!

4)

నీ చిరునగు వెన్నెలలో నీదు కృపాసింధువులో
నీదు ప్రేమ వాహినిలో నిరుపమవిధి దేలియాడ

అమ్మా! నాపై నీ ప్రేమను వర్షింపజేస్తే అయిపోతుందని అలో చిస్తున్నావా? నీవు కృపాసాగరానివే! నీవు ప్రేమప్రవాహానివే! నీవు ఆనందమయివి. నీకు లోటేమిటమ్మా! నాకు నీవు కనిపించకుండటమే పెద్ద లోటుకదా?

రాగదే! మా జనని కాళికా
నీకొరకు చేమోడ్చి నిలచియుంటినె తల్లి ॥రా॥

నీ దివ్యదర్శనము నీ మధురప్రేమమ్ము
నీ తేనె పలుకలను నిత్యమాశింతునే

అనుభవానందముల నర్థించుచుంటినే
సకల శక్తినిధాన శ్రీ కాళికామాయి ॥రా॥

అమ్మా! నీవు శక్తిస్వరూపిణివి. శక్తిప్రదాత్రివి. నీవే ఆద్య శక్తివిగదా! నాకు జ్ఞానభిక్ష పెట్టు తల్లీ! నీ కోసం చేతులు జోడించి అర్థి స్తున్నాను. నీ దివ్యదర్శనాన్ని పొందాలని, నీ ప్రేమను చూరగొనాలని ఆశిస్తున్నాను. నీవే నన్ను ఆదరించకపోతే యితరులు ఆదరిస్తారా అమ్మా!

ఉ॥ రమ్మని యాదరింపగ బరాయిజనంబులకేమి యౌను, ప్రే
మమ్మున స్వంత తల్లి యొక మాటగ బిల్చిన చాలు నంత జి
త్తమ్మున నున్న దుఃఖములు ధ్వంసమునొందుట చిత్రమే, యిదే
రమ్ము! కుమారు బుణ్యము నిరాజిలజేయుము దక్షిణేశ్వరీ!

అమ్మా! నీవు నాకు స్వంత తల్లివి. నీవు ఒక్కసారి కనిపించి ప్రేమతో నన్ను పిలిస్తే ఉన్న ఆనందం వేరే ఎక్కడ ఉంటుందమ్మా! అంతేకాదు. అశాంతి అంతా ఒక్కసారి దూరంగా పారిపోతుందమ్మా!

నిను జేరగా కోర్కి అనలమై బాధించు
కనక నా లోపాల క్షమియింపవే తల్లి!

ప్రణుతితో వినతితో ప్రార్థింతు కాళికా
అనుభవానందముల నను ముంపరావే! నెనరుంచు జననీ

అమ్మా! బిడ్డ ఎన్ని తప్పులు చేసినా క్షమించగలిగేది ఒక్క మాతృహృదయమే. మరి నా తల్లివి నీవేగదా! కాబట్టి నాలో లోపాల్ని క్షమించి సరిదిద్ది నీ దర్శన భాగ్యాన్ని ప్రసాదించమ్మా? నిన్ను అర్థిస్తున్నాను, ప్రార్థిస్తున్నానమ్మా!

ఏమి తెల్పుదునమ్మా! కాళిక ఏమి తెల్పుదునమ్మా!
నిన్ను గనుటే శాంతిపదంబు నీ కౌగిలియే స్వర్గంబు
నీవే ముక్తివి నిజమమ్మా! నీదు యనుభవానందమొసగి
నీదరి జేర్చవె జననీ కాళిక, ఏమి తెల్పుదునమ్మా!

అమ్మా! నీకంటె మోక్షం వేరుగా లేదు. ప్రశాంతి నీ పాదాలవద్దనే ఉన్నదమ్మా! ఈ సకల ప్రపంచాన్ని నీ కౌగిలిలో మరచిపోతానమ్మా!

ఉ॥ అమ్మ యటంచనాదిగ శివా! నిన్ను గాంచక నీ ముఖారవిం
దమ్మును జూడకే పిలిచి దాంతిని దృష్టి వహించుచుంటి నో
యమ్మరో! నేటికైనను దయార్ద్రవుకావుగ! నిన్నుగాంచి 'మా
యమ్మ' యటంచు గౌగిలిదు నయ్యది భాగ్యము దక్షిణేశ్వరీ!

అమ్మా! పరమేశ్వరీ! నిన్ను పిలిచి పిలిచి, నిన్ను చూడకుండా ఎట్లా తృప్తిని పొందటం? నిన్ను గాంచనంతవరకు నాకు శాంతిలేదమ్మా! నీ దివ్య మంగళ స్వరూపం తిలకించనంతవరకు నాకు నిద్రరాదమ్మా! నీ మృదుమధురమైన సంభాషణ విననంతవరకు నాకు సంతోషంలేదమ్మా! నీ దివ్య ప్రేమామృత వృష్టిలో మునుగనంతవరకు అసలు నాకేమీ వద్దు తల్లీ!

నాపై దయరాదా జననీ నాపై కృపలేదా
పలుమారు పలువిధరీతులన్ నిను నెంతో వేడితినే, జననీ
ఎల్లర నీవని నమ్మి నా తల్లులు కారని తెలిసీ, యిక
నీదు పన్నిధి ప్రేమజలధిలో నీదులాడగ వాంఛా

అమ్మా! లోకంలో అందరూ తల్లులు కారని గ్రహించాను. వారిది సంకుచిత ప్రేమ. నీవో విశ్వమాతవు. నీకు విశాలమైన హృదయం ఉన్నది, ఆ విశాల హృదయంలో సువిశాల నిర్మల ప్రేమ ఉన్నదమ్మా? అందుచేతనే నేను నిన్ను ఆశ్రయించి, అనేకరీతులుగా ప్రార్థిస్తూ తపిస్తున్నాను, ప్రేమసాగరంలో ప్రేమకు కరువా అమ్మా!

తల నీ యంకముపై నునిచీ ద్వైతము మరచెదనే
అయ్యదియే నా భాగ్యం అనుభవసామ్రాజ్యం

అమ్మా! మొదట నాకు కావలసింది ద్వైతమె. అమ్మా! ద్వైతంలో ఎంత ఆనందం ఉన్నది! నీవు సగుణమూర్తివై సాక్షాత్కరిస్తావుగదా? నీ అంకతలముమీద నా తలనుంచుకొని అన్నీ మరిచిపోతానమ్మా! అది అద్వైతమేగా! ఇది మహాభాగ్యంకదమ్మా! కాని యీ లోకంలో సామ్రాజ్యాలన్నీ నశిస్తాయి. నీ సామ్రాజ్యం మోక్షసామ్రాజ్యం! ఇందులో అసత్య అనిత్యాలకు తావులేదమ్మా!

నీ యనుభవనగరములో నీ సుమధుర భవనములో
నీ యొడిలో మన నెంచుచు నీ వెనుకనె యరుదెంతును

అమ్మా! అనుభవ నగరం అతి విశాలంకదా! అందులో నీ భవనం యింకా బాగుంటుంది. అందులో జగన్మాతవు నీవుంటావు. నేను నీ ఒడిలో పసివాడినై లోకాతీత స్థితుల్లో మునిగి ఉండిపోతానమ్మా! ఆ ఆనందాన్ని నాకు ప్రసాదించమ్మా! అప్పుడు నాకు యీ ప్రపంచం దేనికమ్మా! ఈ సుఖాలు నాకెందుకు? మరల నాకు యీ జననమరణాలు ఎందుకు? నాకు కావలసింది నీవేనమ్మా!

ఉ॥ ఎన్నటిదాకనో ర్తునిక! నిచ్చట దుఃఖమయ ప్రపంచమం
దెన్నటికోగదా! భగవతీ! భవపాశ విముక్తి గాంచుటల్!
ఎన్నడొ నీదు సన్నిధి ననేక విభూతి లీనమొందు టిం
కెన్నడొ నీకభేదగతి నేకము నొందుట! దక్షిణేశ్వరీ!

పై విధంగా ఆ భవతారిణీ సన్నిధిలో శ్రీరామకృష్ణుడు ఆ తల్లిని చూస్తూ, పూజాదికాలను మరచి, ఆహారనిద్రాదుల త్యజించి, అహర్నిశలు విలపించేవాడు. క్రిందపడి దొర్లి ఏడిచేవాడు ఆ తల్లికై. ఉదయాస్తమయాలు ఎప్పుడు అయినవోకూడ ఆయనకు తెలిసేది కాదు. ఎప్పుడైనా ఆయనకు ఉదయం అయిందనో, సాయంత్రం అయిందనో తెలిస్తే మరి దుఃఖం ఎక్కువ అయ్యేది.

అయ్యో! తల్లీ! కాలము గడచెనె మరియొక దినమిట వ్యర్థ
మయ్యేనే
అరిగిన ఘడియలు మరలి రావుగద! ఏమి చేయుదును త్రిలోక
జననీ

అమ్మా! కాలం పరుగులు వేస్తున్నది. నీ దర్శనం లేక మరొక రోజు గడిచిపోయిందమ్మా! గడిచిన రోజు తిరిగి రాదుగదా! నిన్ను చూడకుండా నేను మరణిస్తానేమో! నా జీవితం అంతా వ్యర్థంగా గడిచిపోతున్నదమ్మా! ఎప్పుడు వస్తావమ్మా?

చ॥ మరియొకరోజు పోయెగద! మాతరొ! నీదు దయార్ద్రదృష్టి నే
నరయగనైతి జన్మమిక వ్యర్థముగాదె! విధాత వ్రాయు వ్రా
తలవిధమిద్ది మేమొ! నను దగ్గర జేర్పగ రక్షసేయ స
త్వరగతి రాగదే! పరమపావనరూపిణి దక్షిణేశ్వరీ!

అమ్మా! నేను కాలానికి లొంగి ఉండేవాడిని. నీవో కాలాన్ని జయించినదానవు. నీవు జననమరణరహితవు. అందుచేత నీకు భయంలేదు. కాని నేను నీవలెకాదుగదా? ఈ విషయం నేను మరిచిపోలేనుగదా! మృత్యువు సమీపిస్తున్నదనే భయం నాకు అనుక్షణం కలుగుతున్నది. నీ దర్శనం కలుగనిదే మృత్యువు కబళిస్తుందనే నా భయం.

అనుపమానంబైన అనురాగమెటువోయె?
అవ్యయంబగు ప్రేమ అరిపోయినదే?
అచలమై అతులమై అనంతధామమై
అలరారు నీ హృదయమేమైనదో! కటా!
ఎటుపోయెనో తల్లి?

అమ్మా! నీ దివ్యమైన అనురాగం ఏమైంది? జగజ్జననివే! నీకు ప్రేమ కరువు అయిందా? నీ విశ్వవ్యాప్త హృదయంలో నాకు స్థానం లేదా? నిన్నే నమ్ముకున్నానే! నీ కొరకే తపిస్తున్నానే! ఎన్నో విధాలుగా ప్రార్థిస్తున్నానే! నామీద నీకు ఎందుకు దయ కలగటం లేదమ్మా?

నా పుణ్యం పరిపక్వం కాలేదా? లేక నేను నిన్ను చూడకూడదనే నియమం పెట్టుకున్నావా అమ్మా? మహాభక్తులైన రామప్రసాద్, కమలకాంత్‌లకు నీ దర్శన భాగ్యాన్ని అనుగ్రహించి ఆనందింపజేశావే! వారిని ధన్యాత్ముల్ని చేశావే! ఆ భాగ్యానికి నేను తగనా అమ్మా? లేక నిన్ను పదే పదే పిలుస్తున్నానని కోపమా? చెప్పమ్మా!

చిక్కుల బన్నగ నేలా? నను ప్రుక్కగ జేయగనేలా!
చిక్కుదీసి నను ముక్తుని జేయుతు చక్కబరచవా నా దీనస్థితి

అమ్మా! ఈ విధంగా నన్ను బాధించటం నీకు యిష్టమేమో? నన్ను ఎందుకు చిక్కులలో ముంచుతావు? నా దీనస్థితిని ఎప్పుడు పోగొట్టుతావమ్మా?

ఉ॥ నీదు యనుగ్రహంబున ననేకులు దుర్ఘటమాయ దాటి, స
మ్మోదముతో నదీతులయి మోక్షము నొందిరటంచు వింటి, నీ
భేదము లేలనమ్మ! ఇది ప్రేమేయనంబడునే? కృపామతిన్
నా దురవస్థ బాపి భవనాశమొనర్పవె దక్షిణేశ్వరీ!

అమ్మా! నీ అనుగ్రహంవలన మాయ నతిక్రమించి ముక్తి పొందారటగా! నీ సహాయం లేనిదే నేనుమాత్రం మాయను దాటగలనా? మరి నన్నెందుకు బాధించటం? ఒక్కొక్కరిని ఒక్కొక్క విధంగా చూడటం నీకు న్యాయమా అమ్మా?

స్థిమితము నాబడు ఆశ్రయమొసగీ
ప్రేమపలుకులతొ దాహము దీర్చి

అనుభవరుచుల నాకలి దనిపి
నను దరి జేర్పవె జననీ

అమ్మా! నీవే నన్ను నీ సన్నిధికి చేర్చుకో! నీ ఆశ్రయం ప్రసాదించు! నీ చల్లని మాటలతో నన్ను సేద దీర్చు తల్లీ! నాపై నీ ప్రేమ వర్షిస్తే సర్వ తృష్ణలు నశిస్తాయి. నీ కరుణ నామీద ప్రసరిస్తే భక్తి కలుగుతుంది. ఇక నీ సన్నిధిలో ఉంటే యిక నాకు మోక్షమేకదమ్మా! నీవు ఆనందమాయివిగదా! నా దుఃఖాన్ని పారద్రోలి ఆనందాన్ని నాకు కూడా అనుగ్రహించమ్మా! నేనుకూడా ఆ ఆనందాన్ని గ్రోలి ఆనంద మూర్తిని అయిపోతాను.

నిన్నే నమ్మితిని నిన్నే వేడితి నన్యభావముల జాడలెరుంగనె
తనయుడగానో! తల్లివిగావో! దర్శనమీయగ జాగులేలకో!
మాయీ! మాయీ! మాయీ! మాయీ! మాయీ! నిన్నే నమ్మితినమ్మా!

అమ్మా! లోకంలో ఎక్కడ చూచినా విషయమృగాలే సంచరిస్తున్నాయి, ఇది లౌకిక అరణ్యం. ఇక్కడ ఉండాలంటే నాకు భయం కలుగుతున్నది. అమ్మా! నీవు నా మాతృమూర్తివికాదా? లేక నేను నీ బిడ్డనుగానా? నా హృదయంలో స్థానం నీకుమాత్రమే! అమ్మా నా హృదయంలో నీకు స్థానం ఉన్నదిగదా! నాకు ని పాదాలవద్ద కొద్ది స్థానం యివ్వలేవా అమ్మా? నిన్ను శరణు పొందిన నాకు అంతమాత్రం అవకాశం లేదా అమ్మా?

అనయము నిన్నని అనుపమ భాషణ గణముల మున్గుటదెన్నటికో!
ధన్యుడనౌట యదెన్నటికో!

అమ్మా! ఎంతకాలానికి నీ దర్శనం కలుగుతుందో! నీ మాటలు వినే అదృష్టం ఎప్పటికి కలుగుతుందో! నేను ఎప్పటికి ధన్యత్వం పొందుతానో! అమ్మా! ఈ జన్మలోనే నాకు ప్రాప్తిస్తాయా? లేక యిట్లా యీ జన్మకు అనుకోవటమేనా? ఆ అదృష్టం ఎప్పుడో నాకు!

ఉ॥ ఎప్పుడు వత్తువో యని యనేక మనో క్రియలన్ త్యజించి, నే
నెప్పుడుగూడ నాయమలహృద్భవనంబును దీసియుంచి, నే
నెప్పుడు నీదు రాకకయి దృక్కుల దిక్కులకిచ్చి వేచియుం
టెప్పుడు వత్తువోగద? మహేశ్వరి! శారద! దక్షిణేశ్వరీ.

అమ్మా! నీవు విశ్వేశ్వరివి. నీవు ఎప్పుడు అనుగ్రహిస్తావో అని ఎదురు చూస్తున్నానమ్మా! ఎప్పుడమ్మ నీరాక? అమ్మా! నిన్ను విడిచి యిక దూరంగా జీవించలేను. నీవే నా తల్లి వని, ఏనాటికైనా తప్పక కనుపించుతావని, అమిత వాత్సల్యంతో చేరదీస్తావని, నా ఆవేదన నశించి పోతుందని ఆశించాను. కాని ఆ ఆశ నిరాశే అయింది. ఇక నా ఓర్పు నశించిందమ్మా! నీ దర్శన భాగ్యానికి నోచుకోని యీ జన్మ నాకు వద్దమ్మా ఇక నాకు మరణమే శరణ్యం. నీకు నామీద ప్రేమఅంటూ ఉంటే నన్ను నీ దరికి చేర్చుకో! ఇదే నా చివరి కోరిక! తర్వాత నీ యిష్టం. నా నమస్కారాలందుకో అమ్మా! 'ఇక నా జన్మము వ్యర్థమనుమ్మీ! ఈ గతి నేనిక బ్రతుకగజాలా!' అని ఖడ్గముచే రామకృష్ణుడు ఆత్మహత్యకే పూనెనుసుండీ!

ఆవేదనాసంభరితుడైన రామకృష్ణుడు అమ్మవారి ప్రక్కనే గోడకు వ్రేలాడుతున్న ఖడ్గాన్ని అందుకున్నాడు. ఆత్మహత్యకు సంసిద్ధుడయ్యాడు. కత్తిని కంఠంమీదికి ఎత్తాడు.

దక్షిణేశ్వరీ ప్రేమావతారిణి తనయుని స్థితిగని యోర్వగగలదే?

లౌకిక విషయాలతో బాటు భగవంతుని ప్రేమించేవారుంటారు కాని కేవలం భగవంతుని ప్రేమించి, స్మరించి, తపించి, విలపించి,

ఆవేదన చెందేవారు చాలా అరుదుగా ఉంటారు. లోకంలో అన్నిటితో పాటు దేవుని ప్రేమించేవారికి దైవదర్శనం అసలు కలుగదు. కారణం అన్నిటికంటే మిన్నగా భగవంతుని ప్రేమించలేకపోవటమే! భగవద్దర్శనానికై యథార్థ ఆవేదన లేకుండటమే!

కాని ప్రాపంచిక విషయ విముఖత కలిగి, తీవ్ర ఆవేదనాసంభరితులకు దైవసాక్షాత్కారం మమ్మాటికీ లభిస్తుంది. వారి ఆ తీవ్రావేదన ఆ దివ్యమూర్తిని కరిగిస్తుంది! వారి ఆవేదనా శక్తికి నిర్గుణం సగుణం అవుతుంది! నిరాకారం సాకారం అవుతుంది! వారి వారి కన్నీటి ప్రవాహం ఆ మూర్తిని దగ్గరకు తీసుకొని వస్తుంది! వారి ప్రార్థనాలకిస్తుంది! వారి ప్రేమను పరీక్షిస్తుంది! వారిని రక్షిస్తుంది! వారిని అనుగ్రహిస్తుంది వారికి ఆనందాన్ని చేకూరుస్తుంది! వారికి మోక్షాన్ని ప్రసాదిస్తుంది! వారికి అనంతమైన ప్రశాంతిని అందిస్తుంది! వారికి బ్రహ్మానుభూతిని కలిగిస్తుంది అదే భక్తి భగవానుల సంబంధం! అదే జీవబ్రహ్మ సంబంధం! అదే మానవ జీవిత గమ్యం. అదే సాధకుని చరమస్థితి! అదే మానవుని ఆనందస్వరూపం!

అట్టి ప్రేమావతారిణియైన విశ్వేశ్వరి, మహామాయ, భవతారిణి జగజ్జనని, శ్రీ రామకృష్ణుని ఆ స్థితిలో చూస్తూ ఊరుకుంటుందా? ఊరుకోగలదా? ఆమె వాత్సల్యవాహినిగాదా! భక్తి పరిపోషిణి గదా! ప్రేమమయిగదా!

మందహాస చంద్రికల్లాడ మధుర భాషణము మమ సంరార
సర్వ వైభవోద్భుత తేజంబును దర్శనమిచ్చెను రామకృష్ణునకు

తమోగుణంతో సృష్టిని, రజోగుణంతో స్థితిని, సత్వగుణంతో లయాన్ని చేస్తున్న ఆ దివ్యశక్తి, లోకమాత, భక్తహృదయ వాసిని, వాత్సల్యమూర్తి, మాతృహృదయ తన బిడ్డ కొరకు పరుగులు వేసింది. ఆతురతతో వచ్చింది. మందహాస వదనంతో రామకృష్ణుని సాక్షాత్కరించింది. శ్రీ రామకృష్ణునికి హస్తాన్ని పట్టుకున్నది. 'నాయనా! అంత తొందర ఎందుకు? ఇన్ని విధాల నీవు ప్రార్థిస్తూ ఉంటే రాకుండా ఉండగలనా తండ్రీ! వచ్చానుగా! చూడు నాయనా' అని తన హృదయంలో ఉన్న వాత్సల్యాన్నంతా నింపి మెల్లగా చల్లని మాట పలికింది అజగజ్జనని.

ఆ దివ్యమాత దర్శనంతో శ్రీ రామకృష్ణుని ఆవేదన దూరం అయింది! ఆ జగజ్జనని శీతల కరస్పర్శతో శ్రీ రామకృష్ణుని అజ్ఞానం నసించిపోయింది! ఆ మాతృమూర్తి మధుర మంజుల పలుకులతో శ్రీ రామకృష్ణుని హృదయంలో ఆనందం పొంగి పొర్లింది! ఆ లోకైకమాత దివ్యతేజస్సుతో శ్రీ రామకృష్ణుని నేత్రద్వయం మూతపడ్డది! ఆ అనందమాయి రాకతో శ్రీ రామకృష్ణుని దుఃఖం పటాపంచలయింది! కంఠం గద్గదం అయింది! హృదయం దివ్యజ్ఞాన సంపదతో నిండిపోయింది! ఆనంద బాష్పాలతో నిండిపోయాయి కన్నులు! ఆ తేజోమూర్తిని చూస్తూ ఆ దివ్యమంగళ స్వరూపాన్ని తిలకిస్తూ, పులకించి పోయాడు రామకృష్ణుడు! తన్మయత్వంలో యీ సర్వప్రపంచ ఉనికినే మరచి పోయాడు రామకృష్ణుడు! ఆ కాళికాదేవి దివ్యత్వం రామకృష్ణునిలో ప్రవేశించినట్లుగా ఉన్నది ఆయన ముఖం. ఇది యథార్థ ఉపాసనా ఫలితం! ఇది సత్య భగవద్దర్శనం! మంగళ ప్రదం! కామ కాంచనాసక్తి దూరం అయితేనే అది భగవదనుభూతి! వైరాగ్యం పరం వైరాగ్యం అయి పరాకాష్ఠనందుకుంటేనే అది దివ్యానుభూతి! ప్రపంచమంతాపైదికి దుమికినా చలించని

నిశ్చలత్వమే ఆ ముక్తి స్థితి! లోకదుఃఖాలకు అతీతంగా ఉంటేనే అది ఆనందస్థితి! వేయేల? ఏ హృదయంలో అహం మమలు లేవో, స్వార్థం లేదో, వ్యక్తిత్వం ఎక్కడ ఉంటుందో, ప్రలోభాలకి అతీతమో, నిర్లిప్తత ఎక్కడ తాండవిస్తూ ఉంటుందో, తన స్థానం ఎక్కడో గమనించుకొనే స్థితియే నిత్యానంద స్థితి! తన కొరకు సాధనలు సలిపి పొందిన యీ అనుభవం శాశ్వతం. సాధనలు లేక యితరులకొరకు తనకు సకలానుభూతులు వచ్చినట్టు ప్రకటించుకొనటం సాధక లక్షణం కాదు. సిద్ధుని లక్షణం అసలే కాదు. అందుచేతనే యథార్థ ఆధ్యాత్మికానుభవం రావటం అతి కష్టం. దుర్లభం అనికూడా అనవచ్చునేమో! అది భగవదనుగ్రహం పొందినవాడు జీవితాంతం ఆ భగవంతునిపైనే ఆధారపడటం కూడా యథార్థమేమో!

శ్రీ రామకృష్ణునికి బాహ్యస్మృతి కలిగింది. కండ్లు తెరిచాడు. తన ఆరాధ్యమూర్తి, తనహృదయాధి దేవత, తన మాతృదేవత చిరునవ్వుముఖంతో, ప్రేమ దృక్కులతో, కరుణామూర్తియై తననే వీక్షిస్తున్న ఆ అనుగ్రహ మూర్తిని తన చక్షువులతో ప్రత్యక్షంగా చూచాడు రామకృష్ణుడు. ఏమి మహనీయుని భాగ్యం!

ఉ॥ పుట్టములన్న దిక్కులగు, బువ్వులదండ కపాలమాల చే
బట్టుట మస్తకంబు కరవాలములన్, గనులగ్ని గుండముల్
గట్టని దీర్ఘ కుంతలము, కాళ్లకుక్రింద శివుండు మూర్ఛలో

దిక్కుల్ని వస్త్రాలుగా ధరించి, కపాల మాలను మెడలో వేసికొని, ఒక చేతిలోకృపణం, వేరొక చేతిలో మానవ మస్తకం, ఒక

చేతిలో అభయముద్ర, వేరొక చేతిలో వరప్రదాతృత్వం, కెంపుల వలె నున్న నేత్రత్రయం, పొడపైన కురులు పాదాల క్రింద సమాధి స్థితుడైన శివుడు గలిగిన ఆ కాళికా దేవిని సాధారణ మానవుడు చూచి భయంతో మతిని పోగొట్టుకుంటాడు. ఆ మూర్తిని దర్శించి నిలువగలిగే శక్తి సామర్థ్యాలు రావాలి. ఉపాసనా మూర్తి లక్షణాలన్నీ సక్రమంగ అర్థం చేసుకొని, ఆచరణకు పూనుకోవాలి ఉపాసకుడు. శివుడు లయ స్వరూపుడైనచో ఆమె సృష్టి స్థితుల్ని చూస్తుంది. శివుడుజ్ఞాన శక్తిస్వైనచో ఆమె ఇచ్ఛాక్రియాశక్తిగా పరిణమిస్తుంది. శివుడు అద్వైత స్థితిని సూచిస్తే ఆమె ద్వైతాన్ని సూచిస్తుంది. ఆమె శరీరం రంగు నీలం, నీలత్వం సర్వాతీత తత్త్వాన్ని తెలుపుతుంది. ఆమె రాజసికులకు భయంకరి సాత్త్వికులకు అభయంకరి. భయంగలవారికి ఆమె ముఖ గహ్వరం నుండి వెలికి వచ్చిన ఎర్రని నాలుక గోచరిస్తుంది. భక్తిగలవారికి ఆమె పెదవుల మీద నర్తిస్తున్న ప్రశాంతమైన చిరునవ్వు కనిపిస్తుంది. ఉపాసకుడు తాను పసిబిడ్డయైననాడు. ఆతల్లి చేతులు అతని లాలిస్తాయి. ఆ హృదయం ప్రేమిస్తుంది. 'యద్భావం తద్భవతి' అనిగదా శాస్త్రము! అందుచేతనే ఆమెయే బ్రాహ్మీశక్తి, వైష్ణవశక్తి, శైవశక్తి, కామారిశక్తి, పరాశక్తి రూపిణిగ విరాజిల్లి ఆయా ఉపాసకులకు ఆనందాన్ని ప్రసాదించే సర్వశక్తి స్వరూపిణిగా వెల్గొందింది.

పై విధంగా ఉన్న ఆ యాద్యశక్తి కాళికాదేవిని గాంచిన రామకృష్ణుడికిమాత్రం ఆమెలో భయంకర లక్షణాలు గోచరించలేదు. అవును. పసివాడికి తన తల్లి ప్రేమయేగాని అన్యం కనిపించదు. అవసరం లేదుకూడా. వాడికికావలసింది తన తల్లి ప్రేమవాత్సల్యాలేగదా!

అదే విధంగా శ్రీరామకృష్ణునికి ఆమె చల్లని చిరునవ్వు కనిపించింది. ఆమె కరుణార్ద్ర నేత్రద్వయం గోచరించింది. ఆమె అభయ హస్తం మాత్రమే కనిపించింది. ఆమెలో మాతృవాత్సల్యాన్నే తిలకించింది ఆయన మనస్సు. అది పసితత్త్వం యొక్క లక్షణం. అసలు అదే శ్రీరామకృష్ణునిలోని ప్రత్యేకత! అదే ఆయన సాధనలోని ప్రత్యేకత, అదే ఆయన సిద్ధత్వంలోని విశిష్టత!

శ్రీరామకృష్ణుని చిన్ననాటి పసితత్త్వం పెరిగి పెరిగి, కాళికా దర్శనంతో యదార్థ పసితత్త్వంగా పరిణమించి, ఆయన సాధనలో మరింత విజృంభించి, ఆయన సిద్ధత్వంలో సంపూర్ణ స్థిరత్వాన్ని అందుకున్నట్లుగా మనకు స్ఫురిస్తుంది. మానవునిలో పశుత్వం నశిస్తేగాని మానవత్వంరాదు. ఆమానవత్వం నిండి నిబిడీకృతం అయితేనే గాని దైవత్వం సిద్ధించదు. ఆదైవత్వం లభిస్తేగాని బ్రహ్మత్వం లభించదు. ఆబ్రహ్మత్వంలో లీనం అయితే గాని పసితత్త్వం అనగా అమాయకత్వం స్థిరత్వం పొందదు. కావ మాయారహితునికే పసితత్త్వం సిద్ధిస్తుందేమో! అట్టి ఆపసితత్త్వంవల్లనే సమస్త స్త్రీలలో జగన్మాతను దర్శించటం! ఆ పసితత్త్వం వల్లనే సకలదేవతల సాక్షాత్కారం! ఆ పసితత్త్వం వల్లనే సర్వమత సామరస్యం! ఆ పసితత్త్వం వల్లనె నిర్మల హృదయం! ఆ పసితత్త్వం వల్లనే హృదయ విశాలత్వం! ఆ పసితత్త్వం వల్లనే ఆ యాకర్షణ! ఆ పసితత్త్వం చేతనే పూజాయోగ్యత్వం! అదే దివ్యానుభవం! అదే దివ్య ప్రశాంతి!

పై విధంగా పసితత్త్వంతో మూర్తీభవించిన రామకృష్ణుడు తన ఆ మాతృమూర్తిని నిర్భయంగా ప్రేమతో తిలకించాడు, పొంగిపోయాడు.

అమ్మా! నేను నీ పసిబిడ్డను. నీవు నా మాతృమూర్తివి. ఇక నన్ను విడువకు. నిన్ను నేను విడిచి దూరంగా ఉండలేనమ్మా!' అంటూ ప్రార్థించాడు రామకృష్ణుడు.

చ॥ ఇపుడెటుపోవనెంచినను నింక అసాధ్యముసుమ్ము నన్ను చా
లపరితపింప జేసితివి, ప్రాణము డస్సినదమ్మ! యింక నీ
వపరిమితంబపైనను సుభక్తి నిబద్ధుగ జేసినాడ ని
న్నెపుడికపై వీడ భవహేతువినాశిని దక్షిణేశ్వరీ!

అమ్మా! నిన్ను యింతకాలం నుండి పిలిచి పిలిచి అలసిపోయానమ్మా! ఇక నిన్ను విడువను విడువలేను. నీవు నాకు ఎదురుగా ఉంటే చాలమ్మా! అన్నీ మరిచిపోతాను. నీ ప్రేమ తత్త్వాన్ని చూస్తుంటాను. నీతో ఆడుకుంటూ, పాడుకుంటూ ప్రశాంతంగా ఉంటాను. నేను కోరేది యిది ఒక్కటే! నామాట కాదనకమ్మా!' నాకు యీ లోకంలో ఏమీవద్దమ్మా! ఇక్కడే ఉంటావుగదమ్మా!

లోకంలో ప్రతి వ్యక్తి భగవంతుని చూడాలనుకుంటాడు. కాని తగిన సాధన లేక పోవటం చేత అది ఫలించదు. ఏదైనా సాధన లేనిదే సిద్ధించదుగదా! పూర్వజన్మ సుకృతం వల్ల, అతని సాధనలచేతనో ఒక పర్యాయం భగవద్దర్శనం లభిస్తుంది. తర్వాత భక్తుడైనా భగవద్దర్శనంవల్ల సంతోషాన్ని, వియోగంవల్ల దుఃఖాన్ని పొందతూ ఉంటాడు. ఈ సంయోగ వియోగాలచేత సుఖదుఃఖాలు కలుగుతూ ఉంటాయి భక్తుల జీవితాలలో.

కాని శ్రీరామకృష్ణుని జీవితంలో కాళికాదేవి దర్శనానికి ముందే ఆ వియోగం, విరహం, దుఃఖం గోచరిస్తాయి. కాళీదర్శనానంతరం ఆ మూడు ఆయన దరిదాపులకు రాలేదు. కారణం ఏమిటి? కాళీసందర్శనార్థం విగ్రహం ముందు క్షూర్చుని విలపించిన రామకృష్ణుడు, జగన్మాతను గాంచుటతోడనే ఉప్పొంగి, ఆమె మరల అంతర్హితం కాకుండా ఆమెకు సాగిలబడి, ఆమె కాళ్లను చుట్టివేశాడు. ఆమె కదలటానికి అవకాశం లేకపోయింది. ఆ నిర్మల ప్రేమకు బందీ అయింది. అదే శ్రీరామ కృష్ణుని బాల మనస్తత్వం! తనను వదలి పసివాడు ఉండలేడని భావించి, ఆ పసివాడిని తాను వదలక, బిడ్డకు ఎట్టి అపదలను రానీయక సర్వబాధ్య తలను ఆ దేవి వహించింది. ఇది చరిత్రలో అపూర్వ సంఘటన! ఇది అందరికి సాధ్యం కాదు. ఇది పరవైరాగ్య మూర్తియైన రామకృష్ణునికే సాధ్యం! ఇది దైవ్యనుగ్రహలబ్ధునికే సాధ్యం! ప్రపంచంలో ఎన్నో సాధించాననుకుంటాడు మానవుడు. కాని యీ జీవితంలో ఒక్క భగవ ద్దర్శనం పొందితే అన్నీ సాధ్యమే అనే పరమ రహస్యాన్ని ఎప్పుడు గ్రహి స్తాడో మానవుడు! అందుకే శాస్త్రం 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం భవతి' అని ప్రబోధించింది. ఆ అదేశాన్ని ఎవరు గ్రహిస్తారు? ఎవరు ఆచ రిస్తారు? ఆచరించి, ఆనందించిన వారు ధన్యాత్ములై, జగద్వంద్యులై, లోకాదర్శకులై, సర్వ ప్రపంచంచేత పూజింపబడుతున్నారు. ఆదర్శం శ్రీరామకృష్ణుడే! నాటగోలె నా భవతరణీమణీ నిత్యదర్శనం బిచ్చెను, పల్కుచు రామకృష్ణ గురు నిత్యానందసుధాముని జేసెను ప్రేమ మూర్తియై.

అనాటి నుండి ఆ పరమేశ్వరి శ్రీ రామకృష్ణునికి నిత్యం దర్శ నం యిస్తూ, 'అమ్మా' అనగానే ఓ యని పలుకుతూ, ఆయన సకల

భావాన్ని వహించింది. ఆయన్ని ఆనందంలో ఓలలాడించింది. ఇక ఆ మహనీయుడికి దుఃఖం ఏది? వియోగం ఎక్కడ? ఆ తల్లి ప్రేమామృతాన్ని ఆస్వాదిస్తూ, ఆనందంతో నృత్యం చేసేవాడు రామకృష్ణుడు.

నేనాడెదనే పాడేదనే కాళికమాతా
వినవే ముందబుగవినవే లోకపవిత్రపూతా ॥నే॥
నీవు నాకు ఎదుట నిలచి నిత్యమైన యండకాగ
నిర్భయమే సుఖమే కాళికమాతా
వినవే ముదంబు గనవే లోకపవిత్రపూతా ॥నే॥

అని సర్వత్ర ఆ లోకమాతను దర్శిస్తూ తన్మయత్వంలో మైమరచేవాడు రామకృష్ణుడు. స్వార్థంతో, లౌకిక భావాలతో ఉండి, ఏదో ఉన్నత పదవిలో ఉండి వస్తున్న సామాన్యమైనతల్లిని చూచి, సామాన్యమైన బిడ్డ పొంగి పోతాడుకదా! కాని మోక్ష సామ్రాజ్యానికే అధినేత, లోకకర్త్రి, జగన్మాత అయిన కాళికాదేవిని గాంచిన రామకృష్ణునికి ఆనందంకాక ఏమున్నది?

ఈ విధంగా భగవతి అనుగ్రహాన్ని పొంది, దివ్యానందామృతపానం చేస్తూ ఉన్న శ్రీరామకృష్ణుని గాంచిన లోకులు ఆయనను పిచ్చివానిగా భావించారు, పైగా ప్రచారంకూడా చేశారు. అవును, భక్తుడు, లౌకికుల దృష్టికి పిచ్చివాడే గదా! అనిత్య విషయాలలో మునిగి అనిత్యం అని తెలిసి వాని వెంట పరుగులు వేస్తూ, వాటిని శాశ్వతంగా ఉంచటానికి ప్రయత్నం చేయువారు పిచ్చివారగుదురు కాని, అనిత్యముల ననిత్యంగా తెలిసి, వాని త్యజించి, సత్యదర్శనానికై తపించువారు ఉన్మ

త్తులుకాగలరా? వారు మహాపురుషులు! ఆ మహానుభావుల నీ పిచ్చిలోకం అర్థంచేసుకోలేదు. ఆ దివ్యాత్ములను యీ విషయాసక్తులు అనుసరింప లేరు. అర్థంచేసుకొనే ప్రయత్నంలేకపోగా యీర్ష్యాసూయాదులతో వారికనేక ఆటంకములు కల్పింతురు. జయమమాత్రం మహాత్ములదే అని వేరుగచెప్పుట అనవసరం. ఇదే లోకం తీరు! ఇదే లోకుల స్వభావం!

ఈ విధంగా శ్రీరామకృష్ణుని విషయం మెల్లమెల్లగా ఆయన జన్మస్థలమైన కమార్పుకూరు చేరుకున్నది. అంత ఆయన మాతృమూర్తి చెవిలో చేరింది. ఆ మాతృ హృదయం తల్లడిల్లింది. అవృద్ధమూర్తి తన బిడ్డకై తపించింది. శ్రీరామకృష్ణుని తనవద్దకు రప్పించుకొన్నది జనని ఆజ్ఞకు బద్ధుడై తల్లి పాదాల చెంతకుచేరాడు రామకృష్ణుడు. ఆయన మాతృప్రేమ అటువంటిది. అందుచేతనే యీ పవిత్ర ప్రేమనే ముందుంచుకొని, కాళీ సాక్షాత్కారం పొందగలిగాడు. మాతృప్రేమ సక్రమంగా ఉంటే భగవత్ప్రేమ విలువ తెలుస్తుంది. మాతృభక్తిలేని వానికి భగద్భక్తి చాలాదూరం.

చంద్రామణీదేవి బిడ్డను చూచి ఆనందించింది. వివాహం చేయాలని నిశ్చయించుకున్నది తల్లి. వివాహం అంటే మరల తన బిడ్డ కలకత్తాకు ప్రయాణం అవుతాడేమో అని భయపడ్డది. తన రెండవ కుమారుడైన రామేశ్వరుని ద్వారా ప్రయత్నాలు ప్రారంభించింది.

నాటికి శ్రీరామకృష్ణునికి 23 సంవత్సరాల వయస్సు. ఆయనకు వివాహ దృష్టియే లేదు. కారణం ఆ దేవదేవీ సాక్షాత్కారమే! ఇక భయం దేనికి? ఆయనకు లౌకిక భావాలే లేవుగదా! ఉంటే భగవతి దర్శనం ఎట్లా కలుగుతుంది? ఈ విషయంలో ఆయనకు సమస్యలే లేవుగదా!

సామాన్య మానవులకు మొదట ప్రపంచం, తర్వాత దేవుడు. మొదట వ్యవహారం తర్వాత ఆధ్యాత్మికత. కాని సాధకులకు మొదట దేవుడు తర్వాత లోకం. మొదట ఆధ్మాత్మికత్వం తర్వాత వ్యావహారికత్వం. రామకృష్ణుడు రెండవ వర్గంలోకి వచ్చినవాడు గదా! భగవద్దర్శనం పొందాడుకూడా. ఇక ఆయనలో భయానికి చోటులేదు. లోకంలో సమస్త స్త్రీలను జగన్మాతరూపాలుగా చూచు ఆయనకు భార్య దృష్టి ఏది? భార్యగాచూచుట ఎక్కడ? వ్యామోహమే నశించిన వానికి బంధమెక్కడిది? వైరాగ్య శిఖరారోహణ చేసినవానికి రాగమెక్కడిది? ఆనంద స్వరూపుడికి దుఃఖమెక్కడిది? ఇంద్రియ నిగ్రహంగలవానికి విషయలోలత్వం ఎక్కడిది? తపోసంపన్నుడికి పతనమెక్కడిది?ఇట్టి ఉన్నతాధ్యాత్మిక స్థితుల్లో ఉన్నవాడు రామకృష్ణుడు.

కమార్పుకూరికి నాలుగు మైళ్ళదూరంలో జయరామవటి అనే చిన్న కుగ్రామం ఉన్నది. అక్కడ రామచంద్రముఖోపాధ్యాయ, శ్యామ సుందరీ దంపతులున్నారు. వారు సద్బ్రాహ్మణులు, సహృదయులు. ఆదంపతులకు జేష్ఠ కుమార్తెగా జన్మించింది శారదాదేవి. నాటికి అయిదు వత్సరాలు బాల శారదకు. ఆ బాల శారదను శ్రీరామకృష్ణునికి యిచ్చి వివాహం జరిపించారు.

ఇక్కడ మరల ఒక అద్భుతం జరగింది. 5 సంవత్సరాల ప్రాయం కలిగిన శారదాదేవిది పసితత్వం. 23వత్సరాలు వచ్చిన రామ కృష్ణునిదికూడా పసితత్వమే. వయస్సు చిన్నది కావటంచేత శారదా దేవికి లోకం పోకడ తెలియదు. యౌవనంలో ఉన్ననూ కాళికారాధనా తత్పరుడైన రామకృష్ణునికికూడా లోక వ్యవహారం తెలియదు. ఈ రెండు పసితత్వాలు ఏకమై, మహోజ్వలమై, లోకుల పశుతత్వాన్ని నశింపజేసి

పసితత్వాన్ని అనగా నిర్మలత్వాన్ని ప్రసాదించాము నిర్మలహృదయాల్ని ఆకర్షించాయి. అట్టివారిని దైవోన్ముఖులుగా తయారు చేశాయి. అదే శ్రీ శారదా రామకృష్ణులలో నున్న ప్రత్యేకత!

వ్యావహారికంగా ధర్మపత్ని అయిన శ్రీ శారదాదేవిలోనున్న దివ్యత్వాన్ని చూచాడు. ఆమెను సాక్షాత్ లోకేశ్వరిగా భావించాడు. ఆమెకు పూజా పీఠాన్ని యిచ్చి, జగజ్జననిగా అర్చించి, మాతృదేవతగా ఆరాధించాడు. సర్వాదర్శమూర్తిగా ఆమెను ప్రథమంలోనే గుర్తించాడు రామకృష్ణుడు. ఆమెను లోకంలోఉన్న సాధకకోటికి సిద్ధమూర్తిగా ప్రసాదించాడు. ఆమెను ముముక్షువులకు మోక్షదాయినిగా అనుగ్రహించాడు. మాత్రారాధనా తత్పరులకు మాతృమూర్తిగా అందించాడు. వ్యావహారిక భర్త యగు రామకృష్ణునిచే పూజల నందుకొన్న శ్రీశారదాదేవి సర్వ ప్రపంచానికి పవిత్ర మాతృదేవత అయింది. దేవీ పీఠాన్నలంకరించి అర్చింపబడిన ఘనత అమెకే సాధ్యమేమో!

శారదదేవియు విషయములంటక గురుచరణంబుల గొల్చి ధన్యయై
భక్తులకెల్లను మాతృదేవియై ప్రతిభ చెలంగెను అనుభవమహిమన్

శ్రీ శారదా దేవిగూడ విషయవిదూరయై, శ్రీరామకృష్ణుని సర్వానుభవముల గ్రహించి, అనేక సాధనల గావించి, సకల సమాధ్యనుభూతుల్ని పొంది, HOLY MOTHER పవిత్ర మాతయై రూపొంది, స్త్రీలోకంలో మకుటాయమానమై, సర్వమానవాళిచే ప్రత్యేకముగా పూజల నందుకొనుచున్నది. ఆమె బ్రహ్మచారిణి కాన బ్రహ్మచారులకు, బ్రహ్మచారిణులకు ఆదర్శము. ఆమె గృహంలో నివసిస్తూ

బంధువుల మధ్యలో ఉంటూ, మమకార రహితమై, తన కవసరం కాకున్నా సక్రమంగా జపధ్యానాదికాల నిర్వహిస్తూ గృహస్థులకు సర్వాదర్శాన్ని చూపించింది. నిత్యసమాధి స్థితులలోనున్ననూ, సాధకులకు తగు ఉపదేశాలను చేస్తూ, వారికై తాను సాధన సాగిస్తూ, సన్న్యాసి సంఘంలో మెలిగే విధానాన్ని చూపించి సన్న్యాసులకు ఆదర్శప్రాయ అయింది. సర్వమత సమన్వయాన్ని రామకృష్ణుడు చూపిస్తే, తన జీవితంలో బ్రహ్మచర్య, గృహస్థ, సన్న్యాస సమరసత్వాన్ని ప్రతిపాదించింది శారదాదేవి. అట్టి సామరస్య మూర్తినిగాంచి, నమస్కరించి, శ్రీ అభేదానందస్వామి ముచ్చటగా, మూడు వాక్యాలలో ఆమె పవిత్రతనంతయు నిముడ్చి, ఒక్క శ్లోకంలో వ్రాశారు. అదే యీ శ్లోకం,

పవిత్రం చరితం యస్యాః పవిత్రం జీవనం తథా।
పవిత్రతా స్వరూపిణ్యై తస్యై దేవ్యై నమో నమః॥

శ్రీరామకృష్ణుని సాధనకంటె శ్రీ శారదాదేవి సాధనలో ఒక విశిష్టత గోచరిస్తుంది. స్త్రీ దైవమైన కాళికాదేవిని శ్రీరామకృష్ణుడు మాతృమూర్తిగా అర్చనచేశాడు. కాని శ్రీ శారదాదేవి మాత్రము రామకృష్ణునిలో ఉన్న పురుషత్వాన్ని త్రోసి, ఆయనను తనకు మాతృదేవతగా మలుచుకొన్నది. ఆయనలోనున్న భర్తృత్వాన్నిదీసి, ఆయనను గురువరేణ్యునిగా నిలుపుకొన్నది. తరువాత ఆయనలోనున్న దేవత్వాన్ని స్వీకరించి ఆయనను తన యిష్టదైవంగా గ్రహించి, దైవంగా భావించింది. ఈ భావత్రయంలోనే ఉన్నది ఆమె ఉత్కృష్టసాధన. ఈ దివ్యసాధన త్రికరణ శుద్ధిగ జేసి అఫలితాన్ని సాధించింది.

రామకృష్ణం హృది ధ్యాత్వా మాతేతి గురుదేవతా।
పూజితాం తాం త్రిరూపేణ శారదాం ప్రణమామ్యహమ్॥

శ్రీరామకృష్ణుని మాతృదేవతగా, గురోత్తమునిగా, దైవమూర్తిగా భావించిన శ్రీ శారదాదేవి ఆ స్థానత్రయాన్ని తానుపొందుటలో ఆశ్చర్యంలేదు. శ్రీ రామకృష్ణుని జననిగ బరికించి తాను బిడ్డయై పవిత్రసంబంధాన్ని వ్యక్తంచేసింది. ఆ సాధనా ఫలితమే ఆమెను జగన్మాతగా చేసింది. శ్రీ రామకృష్ణుని గురుపుంగవునిగా దిలకించి తాను శిష్యురాలై గురు శిష్య సంబంధాన్ని ప్రకటించింది. ఆ సాధనా ఫలితమే ఆమెను ఆధ్యాత్మిక గురుపీఠాన్నలంకరింపజేసింది. శ్రీ రామకృష్ణుని దైవంగా భావించి, పూజించి తాను భక్తురాలయింది. ఆ సాధనా ఫలితమే ఆమెను దేవాలయాలలో దేవీ పీఠాన్నధిష్ఠింపజేసింది. అందువల్లనే ఆమె పవిత్ర చరితయై, పవిత్రస్వరూపిణిగ కీర్తింపబడినది. ఆ దివ్యజననికి యివే సహస్ర ప్రణామములు.

ప్రత్యేకత వ్యక్తులలోనేగాక సాధనలలోగూడ ప్రత్యక్షం అవుతూ ఉంటుంది. అసలు శ్రీ రామకృష్ణుని సాధనా విధానంలోనే ఉన్నదేమో ఆ ప్రతిభ! శ్రీ శారదాదేవి సాధనా విధానంలోనే ఉన్నదేమో ఆ పటుత్వం!

ఇంత సాధనచేసి, యిన్ని అనుభవాల్ని పొందిన శారదాదేవి నిరహంకారియై, తనకు కలిగిన గొప్పదనాన్ని శ్రీ రామకృష్ణునికే అర్పించిన వినయశీలి.

ఉ॥ తల్లిని, సర్వవిశ్వముల దల్లిని గొల్చెడు రామకృష్ణునే
దల్లిగ గొల్చి, ఎల్లరకు దల్లినెయై చెలరారుచుంటి నా

చల్లని స్పర్శవేది కరసంధి మహత్వముచేత నింక జిం
తిల్లక మీరలున్ జగదతీతుని గొల్చి విముక్తిగాంచుడీ!

'నాకు యీ గొప్పదనం శ్రీ రామకృష్ణ ప్రసాదం. చిన్ననాడే శ్రీ రామకృష్ణుని స్పర్శవేదివంటి చేతిని అందుకున్నాను. మీరుకూడా నా వలె చిన్నప్పుడే శ్రీ రామకృష్ణుని ఆశ్రయించి విముక్తిని పొందండి' అనే దివ్యసందేశాన్ని మానవాళికి ప్రసాదించింది ఆ శారదామాయి.

శ్రీ శారదాదేవిని వివాహం చేసుకొని, లౌకిక విషయాలనుకానే వాటిని పారమార్థికం చేసుకొని మరల దక్షిణేశ్వరం చేరుకున్నాడు, రామకృష్ణుడు, ఆలయంలో ప్రవేశించాడు, జగదంబకు నమస్కరించాడు. 'అమ్మా! నీ యిచ్ఛానుసారం అన్నీ జరుగుతున్నవి. నీవునన్ను చేయి పట్టుకుని నడుపుతున్నావుగదా! తల్లి చేతిలో ఉన్నబిడ్డకు భయం ఉండదు. కారణం తల్లి పట్టుకొంటట్టి.

అమ్మా! ఇక నా సాధనలను మరల ప్రారంభిస్తాను. కామ ధేనువులాగ నీవు నా ప్రక్కన ఉంటే అన్నీ నాకు లభిస్తాయి. అమ్మా! నీవు ఆదిశక్తివి. జగన్నాటక సూత్రధారిణివి. సర్వదేవతా స్వరూపి ణివి. ఆయా అవతారాల్ని ధరించేది నీవేగదా! ఆయా రూపాలలో నిన్ను దర్శించాలనుందమ్మా! అమ్మా! అర్థిస్తున్నాను నిన్ను. నేను ఏఏ రూపాల్ని చూడదలిచానో నీవు ఆయా రూపాలతో నాకు దర్శనం యిచ్చి నన్ను అనుగ్రహించు. ప్రాపంచిక సంబంధమైన వాంఛలను తీర్చమని అడగటంలేదే! నీవు సంకల్పిస్తే అన్నీ దివ్యంగా జరుగు తాయమ్మా! అడగనా అమ్మా! నీవు అంగీకరించినట్లేగదా! సరే విను.

అమ్మా! ఆంజనేయుడెవరు? ఆయనను ఏ విధంగా దర్శించాలి? పరమ పతివ్రతా శిరోమణిని చూచే విధానం ఏమిటి! మరి తంత్రసాధన అంటే అర్థం ఏమిటి? రాముని ఉపాసనా విధానమేది? రాధికా సాక్షాత్కారం ఎట్లా కలుగుతుంది? కృష్ణపరమాత్మ ఉపాసన ఎట్లా చేయటం? అద్వైతానుభవం ఏమిటి? వీటిని ప్రత్యేకంగా నాకు తెలుపుతూ, నాచేత సాధనలు చేయించి, ఆయా అనుభవ జ్ఞానాన్ని అనుగ్రహించు తల్లీ! అని ప్రార్థించాడు రామకృష్ణుడు.

ఆ జగన్మాత తన బిడ్డ కోరికను మన్నించింది. ఆయా ఉపాసకులను, గురువులను దక్షిణేశ్వరానికే రప్పించింది. ఆమె సంకల్పం గదా అది! సర్వబాధ్యతల తనపై ఉంచిన పసిబిడ్డయగు రామకృష్ణుని విడిచి ఉండలేకనో, లేక ఆయనను బయటికి పంపినచో నెట్టి కష్టములు వాటిల్లునో అని ఆ లోకమాత, శ్రీ రామకృష్ణుని తన సన్నిధినే ఉంచుకొని సకల సాధనల నాయనచే జేయించెను. అహా! ఏమి ఆతల్లి ప్రేమవాత్సల్యములు! అదియే యథార్థ భక్తి. భక్తునికి భగవంతుడు వశమగుట యథార్థమే! భక్తుల సర్వ బాధ్యతల వహించుటయు సత్యమే! తన జీవిత సర్వస్వాన్ని భగవంతునికై అర్పించినవారి భారం భగవంతునిదే కదా!

శ్రీ రామకృష్ణుని సాధన దాస్యభావనతో ఉపక్రమించాడు. ఎవరికి దాస్యం చేయాలి? అసలు ఎందుకు చేయాలి? దీనివల్ల ప్రయోజనం ఉన్నదా? దీన్ని పొందినవారున్నారా? అనే సందేహం కలుగుతుంది సామాన్యంగా. అసలు భక్తి శాంత దాస్య వాత్సల్య మధురం అనేరీతిగా అయిదు విధాలుగా ఉన్నది. అందులో దాస్యభక్తి రెండవది.

ఇందులో భగవంతునికి దాస్యం చేయాలి. దీనివల్ల ప్రయోజనం ముక్తి. ఈ భక్తిని ఆచరించి చూపించినవాడు హనుమంతుడు. ఆ నిశ్చల భక్తితో జ్ఞానసంస్థితుల్ని పొందగలిగాడు ఆ రామభక్తాగ్రేసరుడు.

'దాస్యం' అంటే సేవ అని అర్థం. ఈ సేవ లౌకికంతో ప్రారంభం అవుతుంది. లౌకికజీవితంలో పేరు ప్రతిష్ఠలకోసం, ధనం కోసం, ఉన్నత పదవులకోసం అనేకుల్ని ఆశ్రయిస్తూ తన వ్యక్తిత్వాన్ని చంపుకుంటాడు పూర్తిగా. ఒకర్ని ఆశ్రయిస్తే వేరొకరికి కోపంవస్తుంది. అందరి కోపానికి గురి అవుతూ, అశాంతిపాలవుతూ ఉంటాడు లౌకికుడు. ఇందులో స్వార్థం పూర్తిగా ఉన్నది. తాను కోరుకున్నది లభింపకున్న యిక వారిని సేవించటం మానుకుంటాడు.

పై విధంగా కాక, యీ లౌకిక విషయాలపై విముఖత్వం కలిగి, సకల సృష్టికర్తయైన భగవానుని భక్తితో సేవించాలనే భావన కలుగుతుంది. భగవంతుని సేవిస్తే ఆనందం కలుగుతుందనే దృఢ విశ్వాసం కుదురుతుంది. భగవానుడు యజమానియై తన సేవలను అందుకోవాలని ఆశిస్తాడు. తాను సేవకుడై ఎన్నోవిధాల సేవించాలని భావిస్తాడు. సేవించేవాడికి వినయ విధేయతలు చాలముఖ్యం. అంతేగాక సేవకుడెప్పుడూ పాదాల చెంతనే ఉంటాడుగదా! వినయవిధేయతలు లేనిదే గురువును సేవించలేడు. గురు శుశ్రూషచేయనిదే విద్యలభ్యం కాదు. 'గురుశుశ్రూషయా వి[illegible]' ర్యోక్తిః విద్యలేనిదే తన యథాస్థితి తెలియదు. అందువలననే దాస్యభావంతో శ్రీరామ చంద్రుని పాదాల వద్దనే విధేయుడై, భక్తితన్మయత్వంతో, నిరహం

కారిప్తై గోచరిస్తాడు పరమపవిత్రుడైన మారుతి. భగవంతుని సర్వదా సేవించే భాగ్యం దాస్యభక్తిలోనే ఉన్నది, సద్గురువును సర్వదా సేవించే మహద్భాగ్యం అంతేవాసియైన సచ్ఛిష్యుడికి కలుగుతుంది. ఈ సేవా భాగ్యంకూడా అందరికి లభించదేమో! ఈ భక్తివల్ల ఏకాగ్రత, నిశ్చలత్వం కలుగుతాయి. స్వార్థం నశిస్తుంది. లోకానికి సర్వాదర్శమూర్తి కాగలడు. ఇదే లౌకికుల సేవకు, భగవత్సేవకు ఉన్న తారతమ్యం. సదా భగవత్సన్నిధానంలో ప్రశాంతంగా ఉండటంకంటె మానవుడు కోరేదేమున్నది? అందుచేతనే శ్రీరామరసామృతాన్ని పానంచేసిన త్యాగయ్యకూడా 'బంటురీతి కొలువీయవయ్య రామా' అని ఉద్ఘోషించాడు ఆ రామచంద్ర మహాప్రభువును. ఆ కొలువు, భక్తి తత్పరులకు, నిరహంకారులకు మాత్రమే లభిస్తుంది, కాని అందరికి దొరకదుగదా!

ఇక మన రామకృష్ణుడు అనవరతం శ్రీ కాళికామాతను అర్చించి, ధ్యానించి, జపించి, తపించి దర్శించి, సేవించాడుగదా! కాని యింకను యీ హనుమదుపాసనచే సేవా భావాన్ని పెంపొందించుకోవాలని ఆయన ఉద్దేశమేమో! లేక పంచభక్తి విధాన సాధనల సాధించాలని సంకల్ప మేమో! ఒకటి సాధించిన వానికి మిగిలినవి సాధ్యమేగదా! 'ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానంభవతి' ఒక్క విజ్ఞానముచే సర్వవిజ్ఞానములును కలుగుతాయని ఉపనిషదాదేశము. అందువలననే ఒక్క శక్త్యారాధనతో శ్రీరామకృష్ణుడు సర్వారాధకుడై, సర్వ సమత్వాన్ని సాధించాడు.

అందుచేత శ్రీరామకృష్ణుడు దాస్య భావనలో సాధన చేయాలని సంకల్పించాడు. దాస్యభక్తికి సర్వాదర్శమైనవాడు హనుమంతుడు. ఆ హనుమదుపాసనను తీవ్రంగా చేశాడు ఆ మహనీయుడు. ఆ సాధనా

విధానంలో కేవలం పండ్లను మాత్రమే భుజిస్తూ, చెట్లపైననే నివసించే వాడు. ఆ సాధనా పటిమచే శ్రీరామకృష్ణదేవుని వెన్నెముక 3 అంగుళ ములు ముందుకు పెరిగి తోకవలె ఉండేదట! ఆ ఉపాసన పూర్తికాగానే మరల ఆ వెన్నెముక యథాస్థితిలో నున్నదట। శ్రీరామకృష్ణుని యీ సాధనా విధానంలో యింతకంటె మనకు వివరములు గోచరింపవు. పై సాధనచే అజన్మ బ్రహ్మచారియు, శివాంశసంభూతుడును, నవ వ్యాకరణవేత్తయు, రామ భక్తాగ్రేసరుడును అయిన ఆంజనేయుని దర్శిం చాడు రామకృష్ణుడు. దర్శన భాగ్యాన్ని ప్రసాదించిన ఆ హనుమంతుడు రామకృష్ణునిలో లీనం అయ్యాడు. శ్రీరామకృష్ణదేవుని సాధనా విధానం లోని ప్రత్యేకత యిదే। ఉపాసనా మూర్తి ఉపాసకునిలో ఐక్యం కావటం ఒక్క రామకృష్ణుని ఉపాసనలోనే గోచరిస్తుంది. అందువలననే ఆయన సర్వదేవదేవీస్వరూపుడయ్యాడుగదా।

పై విధంగా మారుతిని దర్శించి, తానే ఆ హనుమంతుడై, ఆ భావంలో మగ్నత చెంది ఉన్నాడు రామకృష్ణుడు. ఆ విధంగా నిమగ్నుడైన రామకృష్ణుడు ఒకదినం తన గదినుండి పంచవటివైపు తదేకంగా చూస్తున్నాడు. ఆ సమయంలో దివ్య సౌందర్యవతియు, కరుణా స్వరూపిణియు, తేజోమూర్తియు, శాంత స్వరూపిణియునైన ఒక దివ్య స్త్రీమూర్తిని తిలకించాడు. ఆయనలో ఆనందం పొంగి పోయింది. మాతృభక్తి ప్రవహించింది. తన్మయత్వంలో మగ్నం అయ్యాడు. అంతలోనే ఒక వానరం గంతులేస్తూవచ్చి, ఆమె పాదాల వద్ద కూర్చున్నది. ఆమెను, పతివ్రతా శిరోమణియు, రామనామధ్యాన నిష్ణాతయు, క్షమాశీలియు, భూజాతయు, జనకతనయయు, శ్రీరామ చంద్రుని ధర్మపత్నియు అయిన సీతామహాసాధ్విగా గుర్తించాడు

రామకృష్ణుడు. పులకిత శరీరుడై, ఆనందబాష్పయుతుడై 'అమ్మా' అంటూ పంచవటిని సమీపించాడు. బాహ్యస్మృతిని విస్మరించాడు. అంత నా పవిత్రమాతయు చిరునవ్వుతో మెల్లమెల్లన నడచివచ్చి శ్రీరామకృష్ణునిలో లీనం అయింది. సీతాదేవి దర్శనంతో శ్రీరామకృష్ణుని సాధన పూర్తి అయింది.

అంత గురుడు భైరవిబ్రాహ్మణి కడ
హానికరమ్ములు కష్టసాధ్యములు
అరువదినాలుగు తంత్రమార్గముల
నవలీలగ సాధించె శక్తిమై

లోకంలో తంత్రశాస్త్రాన్నిగూర్చి అనేక అపోహాలున్నాయి. ఆ యపోహల్ని తొలిగించాలని శ్రీరామకృష్ణుని ఉద్దేశమో, లేక తంత్రసాధనా ఫలితము పవిత్రమని వ్యక్తం చేయాలని సంకల్పమో! అందుచేత తాంత్రిక సాధనకు పూనుకున్నాడు. ఆ తంత్రి శాస్త్ర రహస్యాలను గ్రహించి, అందు నిష్ణాతుడై, అయానాటవ రహస్యాలను సాధించదలచాడు. ఆయన సంకల్పం అంటే ఆ దేవీ సంకల్పమే కదా! అన్నీ నెరవేరుతాయి.

అట్టి సమయంలో తంత్రశాస్త్రప్రవీణయు, తంత్రసాధనా నుభవసంపన్నయు, బ్రాహ్మణాగణియు, బాల సన్న్యాసినియు, అజాను బాహులాలును, ధైర్యసాహసోపేతయు అయిన ఒక స్త్రీమూర్తి శ్రీరామకృష్ణునివద్దకు వచ్చింది. అది కాళికామాయి దివ్యసంకల్పం. ఆమెయే

భైరవీ బ్రాహ్మణి. ఆమె తంత్ర సాధనానుష్ఠానంలో రామకృష్ణునికి గురుస్థానం వహించింది. ఆమెకు ముగ్గురే శిష్యులు. వారే చంద్ర, గిరిజ, శ్రీరామకృష్ణులు. రత్నాలవంటి శిష్యుల్నిగలిగిన ఆభైరవి బ్రాహ్మణి ముమ్మాటికి ధన్యచరిత అనక తప్పదు. గురుశిష్య సంబంధం భగవత్ప్రసాదితం అయితే ఆనందం తాండవిస్తుంది. లేకున్న ఆ సంబంధం బాధాకరం అయి దుఃఖాన్ని కలిగిస్తుంది.

ఆ విధంగా శ్రీరామకృష్ణుని చేరిన భైరవి బ్రాహ్మణి గొప్ప రామోపాసకురాలు. వచ్చిన వెంటనే శ్రీరామకృష్ణుని రామచంద్రునిగా అనుభవంలో గ్రహించింది. తన యిష్టదైవమే యీ రూపంలో సంచరిస్తున్నట్లు తెలిసికొన్నది. తర్వాత తనను యశోదగా భావించి, రామకృష్ణుని బాల కృష్ణునిగ పుత్రునివలె ప్రేమించింది. ఈ రెండు సంఘటనలు శ్రీరామకృష్ణుడే శ్రీరామ, శ్రీకృష్ణులని మనకు వ్యక్తం చేస్తున్నవి.

భైరవి బ్రాహ్మణి 64 తంత్ర శాస్త్రముల గ్రహించి, సాధనల చేసిన ప్రజ్ఞాశాలి. అట్టి ఆమె తాను శ్రీరామకృష్ణుని గురువుగా నుండటం తన భాగ్యంగా భావించి, పొంగిపోయింది. నిజంగా మహాభాగ్యంకదా! అసలు శ్రీరామకృష్ణునివంటి శిష్యుడు లభించటమే ఆమె చేసుకొన్న పుణ్యం అంటే బాగుంటుందేమో!

శ్రీరామకృష్ణునికి తంత్రసాధనలు చాలా సులభం అయ్యాయి. ప్రథమంలోనే శక్త్యారాధకుడై, జగన్మాత సాక్షాత్కారాన్ని పొందిన రామకృష్ణునికి యీ తంత్రసాధనలన్నీ శీఘ్ర ఫలితాల్ని ప్రసాదించాయి. దివ్యజనని అనుగ్రహం, సద్గురు ప్రాపకం, యోగ్యతలు గలిగిన

సాధకుడు కావటం యిక్కడ విశేషం. భైరవి బ్రాహ్మణి చెప్పినట్లుగా సాధనా విధులన్నీ నెరవేర్చాడు రామకృష్ణుడు. ఆ అనుభవాలలో నిష్ణాతుడయ్యాడు. అవును. లోకమాత ఆయన చేతిని పట్టుకొని నడుపుతున్నప్పుడు ఆయనకు అసాధ్యమేమున్నది? పవిత్రాతి పవిత్రుడయ్యాడు. పూతచరిత్రుడయ్యాడు. అంత కొద్దికాలంలో సర్వాన్ని సాధించిన శ్రీరామకృష్ణుని గాంచిన భైరవి బ్రాహ్మణి ఆనందంగా దక్షిణేశ్వరంనుండి బయలుదేరి, పవిత్రవారణాశిని చేరి, గంగాతీరంలో తీవ్ర తపస్సును గావించుకుంటూ శేష జీవితాన్ని చాలించింది. ఈ విధంగా శ్రీరామకృష్ణుని తంత్రసాధనలు సంపూర్ణం అయ్యాయి.

రామభక్తుడగు జటధారిని గని
రామభక్తిని సాధించుటచే
రామా యని పిల్వగ శ్రీరాముడు
రామలాలుడై కన్పడి యాడును.

'ధర్మోమూలం మనుష్యాణాం' మానవులకు ధర్మమే ముఖ్యం. ధర్మంవినా మానవ మనుగడయే లేదు. అంతేకాక మనోప్రాధాన్యత కలిగిన మానవుడికి ధర్మాధర్మ విచక్షణాజ్ఞానం కలిగి, ధర్మప్రవర్తకుడు కావాలి. అందుచేతనే పురుషార్ధ చతుష్టయం అయిన ధర్మార్ధ కామమోక్షాలలో ప్రథమ స్థానం ధర్మానికే యీయబడ్డది. ధర్మం మోక్షానికి చేర్చి మానవుని జన్మపరంపరనుండి తప్పిస్తుంది. అర్ధం అనగా ధనం కామాన్ని అనగా కోర్కెల్ని రేకెత్తించి మానవుని జన్మపరంపరలో ముంచుతుంది. ఈ వ్యత్యాసాన్ని గ్రహించుకొని ప్రవర్తించేవాడే యథార్థ మానవుడు. పైవిధంగా మోక్షకారణం అయిన ధర్మాన్ని

అనుష్ఠించి చూపిన ధర్మానుష్ఠానతత్పరుడు శ్రీరామచంద్రుడు. వాక్కును ప్రధానంగా కలిగిన మానవుడు 'సత్యం వద' అనే సత్యనిష్ఠను పాటించాలని, విచక్షణాజ్ఞానం కలిగిన మానవుడు 'ధర్మం చర' అనురీతిగా ధర్మానుచరుడు కావాలని, సత్యధర్మముల ప్రాముఖ్యాన్ని అనుష్ఠించి చూపించినవాడు రామచంద్రుడు. అందుచేతనే 'రామో విగ్రహవాన్ ధర్మం' రాముడు ధర్మస్వరూపుడని ప్రఖ్యాతుడయ్యాడు. ఆయన రాజ్యం సత్యధర్మాలపై ఆధారపడ్డది. అందువలననే 'రామరాజ్యం' అయింది. రామునివంటి ధర్మావతారం వేరొకచోట గోచరింపదు.

అటువంటి దశరథరాముని బాల్యంనుండి సత్యనిష్ఠలో ఆదర్శంగా పెట్టుకొనిన శ్రీరామకృష్ణుడు రామోపాసన చేయాలనుకున్నాడు, వాత్సల్యభావంలో సాధనచేసి బాలరాముని దర్శించాలనుకున్నాడు. ఆయనకు ఆ కోరిక సహజమే! శ్రీ కాళికారాధనతో, విశ్వమాత దర్శనంతో పసివాడైన రామకృష్ణుడికి బాల రామునితో ఆడుకోవాలనే కోరిక కలిగించేమో! కల్మషంలేనివాడు పిల్లలేగదా! అందుచేత బాలరాముని ఉపాసనకు ఉపక్రమించాడు మన రామకృష్ణుడు.

ఆయనకు సంకల్పం కలిగింది. వెంటనే దక్షిణేశ్వరానికి ఒక రామోపాసకుడు వచ్చాడు. ఆయన పేరు 'జటధారి' ఆయనవద్ద ఒక రామలాల విగ్రహం ఉన్నది. ఆ జటధారి వాత్సల్యభావంతో రామచంద్రుని ఉపాసించి, బాలరాముని దర్శనం పొందిన మహనీయుడు. బాలరాముడు ఆయనతో నివసిస్తూ, ఆడుకునేవాడు. ఆయనవద్దనున్న రామలాల విగ్రహం ఆయనకు మాత్రం పంచవర్ష ప్రాయుడైన బాల రాముడే, పరులకు విగ్రహం, ఆయనకు, చైతన్యమూర్తి. నస్నాం

చేయటం తినిపించటం తాను స్వయంగా చేసేవాడు ఆ ధన్యజీవియైన జటాధారి. ఆ జటాధారివద్ద శ్రీరామకృష్ణుని వాత్సల్యభావసాధన ప్రారంభం అయింది. భగవంతునితో ఆటపాడుకుంటే గురువు లభ్యం కావటం దుర్లభం, శిష్యుని యథార్థ ఆవేదనకు తగిన గురువులే కొంత మందికి లభిస్తారు. కారణం శిష్యుని యథార్థ ఆవేదన. ఆ విధంగా జటాధారి శ్రీరామకృష్ణునికి గురువయ్యాడు.

శ్రీరామకృష్ణుడు సర్వదా జటాధారి వెంటనే యుండెడివాడు. రామలాల విగ్రహానికి జటాధారి చేసే సేవల్ని చూచేవాడు. ఆ బాల రాముని దర్శింపగలిగాడు. బాలరాముడు జటాధారిని వదలి శ్రీరామ కృష్ణునిచేరి, ఆయనతోపాటు ఆడుకుంటూ తిరిగేవాడు. జటాధారివచ్చి భోజనానికి పిలిచినప్పుడు మాత్రం వెళ్ళి, తిరిగి వచ్చేవాడు బాలరాముడు. దీనిని గాంచిన జటాధారి ఒక దినం శ్రీరామకృష్ణునిచేరి 'నేను మరల ప్రయాణం సాగిస్తాను. కాని నా యీ ఉపాసనా దైవం మీతో ఉంటానంటున్నాడు, అందుచేత వానిని మీ వద్దనే ఉంచి వెళ్ళుతాను ఇక సర్వబాధ్యతలు మీవే' అని పలికి, బాలరాముని వప్పగించి దక్షిణేశ్వరాన్ని వదలి వెళ్ళాడు.

ఇక నాటినుండి చిన్నిరామచంద్రుని బాధ్యతలన్నియు శ్రీరామకృష్ణునివే. ఆ కౌసల్యాతనయుని లాలిస్తూ, స్నానంచేయిస్తూ, భోజనం చేయిస్తూ, ఆడిస్తూ, పాడిస్తూ ఆనందిస్తూ ఉండేవాడు రామకృష్ణుడు. ఇది ఒక అనిర్వచనీయానందానుభవం. ఉపాసకుడు తన తీవ్రఉపాసనచే నిరాకారుని సాకారము చేసికొనగలడు. ఎప్పుడో ధర్మ సంరక్షణార్థం జన్మించిన అవతారాలను ఇప్పుడు దర్శింపగలడు. ఎక్కడో జన్మించిన

ఆ తన యిష్టదైవమును యిక్కడ సాక్షాత్కరింప జేసికొనగలడు. ఒక కాలమున జనించి శరీరాన్ని త్యజించిన ఆ పుణ్యపురుషుని యీ కాలమున వీక్షింపగలడు, సంభాషింపగలడు. ఆ నాడు బాలరాముని గన్నతల్లి కౌసల్యయు, కృష్ణకిశోరుని పెంచిన యశోదయు పుత్రి మమకారముచే వారి యదార్థ మాహాత్మ్యమును గ్రహింపలేక పోవచ్చునుకాని యీ వాత్సల్య భావ సాధన చేసిన సాధకులుమాత్రము నిత్యానందాన్ని పొంద గలరు. ఇది సత్యము, ముమ్మాటికి సత్యము.

పై విధంగా సేవలనందిన బాలరాముడు కొంత కాలం శ్రీరామకృష్ణునితో ఆడుకొని, ఆనందింపచేసి. ఆయనలో లీనం అయ్యాడు. సకలావతారములకు మూలకారణమైన కాళికాదేవిలో శ్రీరామచంద్రుడు అంతర్గతమే! ఆ కాళీస్వరూపుడైన శ్రీరామకృష్ణునిలో రామచంద్రుడు ఐక్యం అవటంకూడ సహజమేకదా! ఈ విధంగా శ్రీరామకృష్ణుడు రామోపాసనద్వారా శ్రీరాముని దర్శనం పొందాడు.

వాత్సల్య భావంతో బాల రాముని దర్శించిన శ్రీరామకృష్ణునికి యింకను తృప్తి కలుగలేదేమో! బాల రామునితో ఆడుకుని ఆనందించి నట్లు కృష్ణ కిశోరునికూడా దర్శించి లాలించాలనుకున్నాడు ఆ దివ్యమూర్తి వాత్సల్యభావంలో స్థిరత్వం పొందాలని ఆయన భావమేమో! అందువలన మరల ఆ యశోదానందనునికై ఆవేదన చెందాడు. ఆ కాంక్షతో తపించాడు. ఆయనకు సంకల్పం కలగటం, దాన్ని నెరవేర్చే బాధ్యత జగన్మాత గ్రహించటం సహజమే కదా!

తల్లి బిడ్డకై తపించటమే వాత్సల్య భావంలోని పరమ రహస్యం. ఆ విధంగా రామకృష్ణుడు బాల కృష్ణునికై ఆవేదన చెందాడు. అది అవిరళ కృషి. ఆ కృషి ఫలితంగా చిన్నికృష్ణుడు దర్శనం యిచ్చాడు. రామకృష్ణుని హృదయం ఆనందంతో నిండిపోయింది. ముఖంలో అమాయకత్వం తాండవిస్తుండగా, నెమలి పింఛాన్ని ధరించి, కొంటెతనంతో అల్లరిచేస్తూ, చిరునవ్వు ముఖంతో, చేతిలో మురళితో నున్న ఆ మోహన రూపాన్ని చూచిన శ్రీరామకృష్ణుడు వాత్సల్యంతో 'నందనందనా! నల్లనయ్యా! కన్నయ్యా! నా తండ్రీ! యిటు రా! యిటురా!' అని ఆనందంతో గద్గద గళుడై పిలిచేవాడు. వెంటనే ఆబాలకృష్ణుడు చిన్ని చిన్ని అడుగులతో నృత్యం చేసుకుంటూవచ్చి శ్రీరామకృష్ణుని ఒడిలో ఒదిగిపోయేవాడు. ఆ దివ్యస్పర్శకు పులకించి పోయేవాడు శ్రీరామకృష్ణుడు. ఆ నీలమేఘశ్యాముని హృదయానికి హత్తుకొని ఎంత ఆనందంతో పొంగిపోయేవాడో శ్రీరామకృష్ణుడు! ఆ ఆనందాన్ని మనం ఊహించలేమేమో అనుకుంటాను. అదే ఉపాసనా విధానంలోఉన్న రహస్యం! ఉపాస్యదైవాన్ని సందర్శిస్తేనే అది ఉపాసన! ఇష్టమూర్తిని మనసారా వీక్షిస్తేనే ఆనందం! ఈ విధంగా తన ఆట పాటలతో కొంతకాలం మురిపించిన ఆ నందకిశోరుడు శ్రీరామ కృష్ణునిలో విలీనం అయ్యాడు.

మధుర సఖ్యముల ననుభవింపగా
రాధిక తానై విరహవేదనల
'కృష్ణా' యని ఎలుగెత్తి పిల్వగా
కృష్ణకిశోరుడు సాక్ష్యము నల్పెను.

భక్తి సాధనలలో మధురభావ సాధన, సఖ్యభావ సాధనలు కూడా ఉన్నాయిగదా! వాటిని సాధన చేయాలని భావించాడు, శ్రీరామ కృష్ణుడు.

భక్తిలో పరాకాష్ఠ నందుకున్నది రాధాదేవి. ఆమెభక్తి అసమానం. తన నిర్మల భక్తితో శ్రీకృష్ణ పరమాత్మను కట్టి వేసింది ఆమె, ఆరాధికా భక్తి తనకు రావాలని భావించిన రామకృష్ణుడు మొదట రాధిక నారాధించి దర్శించాడు.

భగవంతుని భర్తగా ఉపాసన చేయటం మధురభావంలో ఉన్న రహస్యం! భక్తుడు భగవంతునిచే భరింపబడువాడుగాన భగవానుని భర్తగా ఆరాధించటం అని అర్థం. రాధాదేవి యీ భావనతో శ్రీకృష్ణ నుపాసించి, ఆరాధించి, తపించింది. అందుచేత శ్రీరామకృష్ణుడు తాను రాధికా భావనతో శ్రీకృష్ణునికై విరహవేదనను పొందాడు. స్త్రీవలె వస్త్రధారణంచేసి, సున్నిత హృదయుడై, తనను తాను మరచి, రాధా తత్త్వమున లీనమై, కృష్ణ వియోగంతో అలమటించాడు. మధుర భావంతో ఉపాసనచేశాడు. విరహవేదనాన్ని అనుభవించాడు ఆ రాధికా చిత్తచోరుడు దివ్యసుందరమూర్తియై, వ్యత్యస్త పాదారవిందుడై, శిఖిపింఛధరుడై, మురళీధరుడై, నీలమేఘ శరీరుడై శ్రీరామకృష్ణునికి దర్శనం ప్రసాదించాడు. శ్రీరామకృష్ణునిలో లీనం అయ్యాడు. శ్రీరామ కృష్ణునికి ఏడవ యేటనే శ్రీకృష్ణ సందర్శనానుభవం కలిగింది. మరల రాధికాదేవి ఆదర్శంతో మధురభావంతో ఉపాసన చేశాడు రామకృష్ణుడు. నాడు కమార్పుకూరిలో కలిగిన అనుభవానికి సుస్థిరత్వాన్ని కలుగజేసు కొన్నాడేమో రామకృష్ణుడు. నాడు కృష్ణుని దర్శించాడు, నేడు తనలో ఆకృష్ణ పరమాత్మని ఐక్యం చేసికొన్నాడు. ఐక్యతలో వియోగంలేదు.

విరహంలేదు. శ్రీరామకృష్ణ దేవుని సాధనావిధానంలోనే ఉన్నదేమో యీ ప్రత్యేకత!

తర్వాత సఖ్యభావంలో సాధనచేశాడు రామకృష్ణుడు. గోపాలుని శ్రీకృష్ణుని స్నేహితుడిగా భావించటాన్ని సఖ్యభావం అంటారు. స్నేహంలో సమానత్వం గోచరిస్తుంది. మనకు కుచేల కృష్ణుల సంబంధంలో ఆ తీయని స్నేహం కనిపిస్తుంది. అక్కడ తరతమ భేదం గోచరింపదు. ఆ ఉపాసననుకూడా కొనసాగించాడు రామకృష్ణుడు. గోపాలుని సాక్షాత్కారం పొందాడు.

పై విధంగా శ్రీరామకృష్ణుడు సకల సగుణానుభవాల్ని సాధించి సగుణానుభవ స్వరూపుడయ్యాడు. అసలు శ్రీరామకృష్ణ దేవుని సాధనా విధానంలోనే ఒక ప్రత్యేకత ఉన్నది. భక్తుడు భగవత్సాక్షాత్కారం పొందినప్పుడు ఎంతో ఆనందాన్ననుభవిస్తాడు. కాని ఆ భగవంతుడు దూరం కాగానే మరల దుఃఖాన్ని పొందుతాడు. భక్తుడు_భగవంతుడు వేరుగా ఉన్నారందులో. కాని యీ శ్రీరామకృష్ణ సాధనా విధానంలో భగవత్సాక్షాత్కారం కలగటం, మరల ఆ భగవంతుడు భక్తుని వదలి ఉండలేడేమో అనునట్లుగా భక్తునిలో విలీనం అవుతాడు. ఇక భక్తునికి వియోగం ఎక్కడిది? విరహం ఎక్కడిది? దుఃఖంఏది? ఇదే ద్వైతాద్వైత సమన్వయమేమో! ఇదే భక్తి జ్ఞానముల ఏకత్వమేమో! ఇట్టి సమన్వయమూర్తి మనకు లభించుట ఎంత ఆనందదాయకం!

సగుణానుభవం పూర్తి అయితే యిక నిర్గుణానుభవం, సాకారం పూర్తి అయితే నిరాకారం. ద్వైతం పూర్తి అయితే అద్వైతం అన్నమాటే! అందుచేతనే 'ఆదౌ సగుణమాశ్రిత్య నిర్గుణంచ తతః పరం'

అని శాస్త్రోక్తి. ఇక శ్రీరామకృష్ణుడు అద్వైతానుభవాన్ని ఆస్వాదించ టానికి సంసిద్ధంగా ఉన్నాడు. ఆ అనుభవాన్ని ప్రసాదించగలిగే గురువు రాకకై నిరీక్షిస్తున్నాడు రామకృష్ణుడు.

తోతాపురి నా యతివరు సన్నిధి
అద్వైత జ్ఞానమును బొందుచు
సర్వాధ్యాత్మిక గమ్యము నాఖడు
నిర్వికల్పమున నుండె త్రియాహము.

అట్టి సమయంలో జగన్మాత అనుగ్రహంవలన ఆయాధ్యాత్మిక గమ్యమైన అద్వైతానుభూతిని అందించటానికి ఒక సన్న్యాసి దక్షిణేశ్వ రానికి వచ్చాడు. బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠుడు, దిగంబరియు, నిర్వికల్ప సమాధ్యనుభవాన్ని ఆర్జించిన నాగ సంప్రదాయానికి చెందిన యతిపుంగవు డాయన. ఆ మహాయనీయమూర్తియే పురీ సంప్రదాయానికి చెందిన తోతాపురీ యతివరేణ్యుడు బాల్యంలోనే విరాగియై, విషయవిముఖుడై, నర్మదానదీ తీరంలో, అత్యుగ్ర తపస్సును గావించిన మహనీయమూర్తి తోతాపురి. సుమారు 40 సంవత్సరాలు సాధనచేసిన ఆమహాత్మునకు నిర్వి కల్ప సమాధి లభించింది. ఆ సమాధినుండి ఏదో ఒక అవ్యక్త శక్తిచే ప్రేరేపింప బడి, అందుండి బహిర్గతమై, అంత పాదచారియై దేశములు గుమ్మరుచు, కలకత్తాకువచ్చి, దక్షిణేశ్వరానికి ఏతెంచి దేవాలయ ప్రాంగ ణంలో అడుగు పెట్టాడు ఆయన. శ్రీరామకృష్ణునిచూచాడు. ఎంతో ఆనందిం చాడు. తగినవాడు లభ్యం అయ్యాడు అనుకున్నాడు తోతాపురి. దగ్గరికి రమ్మని పిలిచాడు. వినయ విధేయతలతో, నమస్కరిస్తూ తోతాపురిని సమీపించాడు రామకృష్ణుడు. ఒకరినొకరు చూచుకున్నారేమో! అది బాహ్యంకాక అంతరం అయి ఉంటుంది. అది యోగ్యులైన గురుశిష్యుల సమాగమం! అది సాధక సిద్ధుల సమావేశం! అది సాకారనిరాకార

స్థితుల కలయిక! అది సగుణనిర్గుణముల సమైక్యత! అది ద్వైతాద్వైత ముల అభేదసంస్థితి! అది ఆ జగన్మాత సంకల్పశక్తిచే కలిగిన అపూర్వ, ఆదర్శ, సిద్ధుల సమ్మేళనం! అది సాధకుల మహద్భాగ్యం!

అంత తనను సమీపించిన రామకృష్ణుని గాంచిన తోతాపురి 'నాయనా! నీకు అద్వైతానుభవాన్ని ప్రసాదిస్తాను. ఆ అనుభవాన్ని పొందాలంటే యత్యాశ్రమం స్వీకరించాలి. నీకు సమ్మతమేనా' అని ప్రశ్నించాడు రామకృష్ణుని. శ్రీరామకృష్ణుడు మందహాసం చేసి 'మా అమ్మను అడిగి వస్తాను. మా అమ్మ చెప్పినట్లు చేస్తాను' అన్నాడు. వెంటనే కాళీమాత ఆలయంలో ప్రవేశించి, ఆ జగన్మాత దరికి వెళ్ళి ఏమి ప్రశ్నించాడో. ఆమె ఏమి సమాధానం చెప్పిందో మనకు తెలియదుగాని రామకృష్ణుడు బయటకువచ్చి, 'మా అమ్మే మిమ్మల్ని నాకోసం యిక్కడకు రప్పించిందటకదా! మీవద్ద నేర్చుకోమన్నది' అన్నాడు. అవును శ్రీ కాళికాదేవి దర్శనంతోనే శ్రీరామకృష్ణుడు తన వ్యక్తిత్వాన్ని దూరం చేసుకున్నాడుగా! ఇక ఆయనకు కావలసినవి చేకూర్చటం ఆతల్లి బాధ్యతయేగదా! ఆయన ఏ కార్యాన్ని చేసినా దాని సంకల్పం ఆ లోకైకమాతదే! అదే ఆయన పసితత్త్వాన్ని, అహంకార విదూరత్వాన్ని నిరూపిస్తాయి.

ఒక శుభదినాన తోతాపురి శ్రీరామకృష్ణునికి సన్న్యాసదీక్షను అనుగ్రహించాడు. వినూత్న కాంతితో ప్రకాశిస్తున్న ఆ శిష్యరత్నాన్ని చూచి, ఆనందంతో పొంగిపోయాడు ఆ గురుపుంగవుడు. వెంటనే శ్రీరామకృష్ణుని ఆసీనుని చేసి, నిర్వికల్ప సమాధినిగూర్చి బోధించాడు. అతి శీఘ్రంగా దాన్ని గ్రహించిన రామకృష్ణుడు, ఆధ్యాత్మిక శిఖరం అయిన ఆ నిర్వికల్పాన్ని అధిరోహించాడు. ఆస్థితిలో మూడు దినాలుండి

పోయాడు బాహ్యస్మృతిని మరచిపోయి. అది సచ్ఛిష్యుని లక్షణం. శిష్యులు ఎంతమంది అవి లెక్కకాదు సద్గురువుకి. తోతాపురి ఆత్మా శ్చర్యానందాలలో మునిగి పోయాడు. శ్రీరామకృష్ణుని అవతారవరేణ్యు నిగా గుర్తించి, లోకోద్ధారకుడని గ్రహించి, ఆయనకు బాహ్యస్మృతిని కలిగించాడు. నాడు ఆ తోతాపురియే మన రామకృష్ణునికి బాహ్య స్పృహను కలిగించకున్న ఆ ద్వైతాద్వైత సమన్వయాన్ని మనకు బోధించే వారెవరు? అ సర్వ దేవదేవీ సాక్షాత్కార సాధన విషయాల్ని మనకు తెలిపేవారెవరు? ఆయనుభవరహస్యాలన్నింటిని మనకు వివరించే వారెవరు? అట్టి సర్వమత సమన్వయాచార్య వరేణ్యునికి తోతాపురి బాహ్యస్మృతిని కలిగింపనిచో, సువిశాల విశ్వతోముఖ భారతీయ సంస్కృతీ ప్రాశస్త్యాన్ని ప్రపంచానికి ప్రబోధించిన శ్రీ వివేకా నంద స్వామిని తయారు చేయువారెవరు? అందువలన మనము ముందుగా ఆ తోతాపురీ సంయమిచంద్రునకు ప్రణామాల్ని సమర్పించటం ఉచిత మేమో!

ఈ విధంగా మన సనాతన ధర్మంలో నిర్వచితమైన సకల సగుణ నిర్గుణానుభవ సంపదల పొందిన రామకృష్ణుడు యింకను తృప్తిని పొందలేదు. మతాంతర సాధనల గావించుటకు సంసిద్ధుడయ్యాడు. ఆ మత రహస్యగ్రహణానికి గవేషణ సాగించాడు. ఆ మత విధానాల ననుష్ఠించి, ఉదార హృదయంతో, అ విషయాల్ని బోధించగలవారికై శ్రీరామకృష్ణుడు నిరీక్షించసాగాడు.

ఏ విషయాన్నైనా సక్రమంగా గ్రహించనిదే ప్రసంగించటం గాని, విమర్శించటంగాని చేయకూడదుగదా! తమ మతాన్ని అభిమా నించుట మంచిదేగాని పరమతాన్ని ఖండించటం అనేది సహృదయుల

లక్షణం కాదేమో! తమ మతాభిమానం పరమత దూషణానికి ఉపయో గించుట కూడదు. పరమత ఖండనచేత కలతలు, ఆ కలతలచేత పరస్పర ద్వేషం, ఆద్వేషంచేత అశాంతి ప్రజ్వరిల్లుతాయి. ఒక మతా న్ననుసరించటం, ఒక దైవాన్ని పూజించటం, మత గ్రంథాల్ని పఠిం చటం ఆనందాన్ని పొందటానికిగాని దుఃఖాన్ని అధిkం చేసికొటానికి కాదుగదా! ఈ సూత్రాన్ని రామకృష్ణుడు చక్కగా పాటించటం చేతనే సర్వమత రహస్యాల్ని గ్రహించ యత్నించాడు. ఆ యా మతాధిష్ఠాన మూర్తుల్ని దర్శించ ప్రయత్నించాడు. అందుచేతనే సకల మత సామ రస్యాన్ని, సర్వమత సహనాన్ని అనుష్ఠించి బోధించటానికి ఉపక్రమిం చాడు. ఈ యాదర్శం ప్రతి వ్యక్తికి ఉంటే నేటి ప్రపంచంలో యీ అల్లకల్లోలాలకు తావులేదు. సర్వత్ర శాంతియే తాండవిస్తుంది. మొదట మానవుడు మానవుడుగా జీవించటం రావాలి. మానవుడు తన మానవ త్వాన్ని కాపాడుకోవాలి. ఆపైన దేవత్వం దానంతట అదే సిద్ధిస్తుంది. ఈ రహస్యాన్ని ప్రతివ్యక్తి విశాల హృదయంతో గ్రహించి. విశాల దృష్టితో చూడాలి. విశాలంగా ఆలోచించాలి. విశాలత్వం ఉన్నచోట సంకుచితత్వం ఏదీ? మానవత్వం ఉన్నచోట కలతలేవి? వెలుతురున్న చోట చీకటికి తావేది? శాంతి నివసించే స్థలంలో అశాంతికి చోటేది? సర్వత్రశాంతి చంద్రికలు ప్రసరిస్తుంటాయి. అప్పుడే 'ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః' అనే శాంతి పాఠం సార్థకత చెందుతుంది. అట్టి శుభదినం ఎప్పుడోకదా! శాస్త్రాలు ప్రబోధిస్తాయి. మహాత్ములు ఆచరించి చూపిస్తారు. కాని ఎవరికి వారు కృషిచేయకున్న లోకమున నేదియు లభ్యం కామగదా! ఈ రహస్యాన్ని ఎప్పుడు గ్రహిస్తారు? ఎప్పుడు ఆచరిస్తారు? ఎప్పుడు ఆనందిస్తారు? ఏమో!

దక్షిణేశ్వరానికి సాధువులు సన్న్యాసులు, వైష్ణవులు, శాక్తేయులు, ఫకీరులు అందరు వచ్చేవారు. వారందరూ ఆ ఆలయావరణలో ఉన్న గదులలో నివసిస్తూ ఉండేవారు. అట్టివారికి భోజనాదికవసతుల్ని ఏర్పాటు గావించిన ధన్యజీవి రాణి రాస్మణి. ఆ విధంగా వచ్చిన వారిలో ఒక ఫకీరు గోవిందరాయ్. అతడు మహమ్మదీయుడవటంచేత నిర్ణీత వేళలలో నమాజు చేసేవాడు. దాన్ని చూచిన శ్రీరామకృష్ణుడు గోవిందరాయ్‌ని చేరి, వారి మత విషయాల్ని అనేకం చర్చించేవాడు. తర్వాత ఆ మహమ్మదీయ సిద్ధాంతాల్ని ఆమూలాగ్రంగా విని, నమాజుల చేస్తూ, మహమ్మదీయులకు పవిత్ర గ్రంథమైన ఖురాను సూక్తుల గ్రహించి, వారి సాధనల ననుష్ఠించాడు రామకృష్ణుడు. మూడు రోజులు సాధన గావించి, మహమ్మదును దర్శించాడు. ఆ మహమ్మదు కూడ శ్రీరామకృష్ణునిలో లీనం అయ్యాడు. ఆ మత సాధనల మూడు దినములు చేసి, శ్రీరామకృష్ణుడు విజయం సాధించాడంటే అది కాళికా దేవి దివ్యానుగ్రహంకదా!

శ్రీరామకృష్ణుని గదిలో బైబిలు, ఖురాను గ్రంథములు, ఏసుక్రీస్తు పటములుండెడివట! ఆ మత సాధనల జేయకముందు గూడ శ్రీరామకృష్ణుడు సర్వ సమత్వమునే చూపెడివాడు. ఆయన ఎవరిని కూడ బలవంతముగ మతములనుండి మార్చలేదు. అది ఆ మహనీయుని విశాల హృదయాన్ని సూచిస్తుంది. అందువల్లనే సర్వ మతస్థులు ఆయనవద్దకు అరుదెంచుట! మతానికి ఆధారమైన మనస్సు, ఆ యా ముఖ్య సూత్రాల్ని పాటించాలనేదే ఆ దివ్యమూర్తి సిద్ధాంతం. శ్రీరామకృష్ణుని శిష్యులలో శరచ్చంద్ర, శశిభూషణులు పూర్వజన్మలో

క్రైస్తవులైనట్లు ఆయన దివ్యదృష్టికి గోచరించింది. వారే తర్వాత సన్న్యసించి శారదానందస్వామి, రామకృష్ణానంద స్వాములుగా తయారైరి. వారిరువురు బైబిలు గ్రంథంలోని సూక్తుల్ని, విషయాల్ని ప్రసంగిస్తూ పాశ్చాత్యులకుకూడా ఆశ్చర్యాన్ని కలిగించేవారు. మత ద్వేషమునగాక, ఆ యా మతానుయాయుల స్థితిని గమనించి, వారికి అనుగుణమగు సందేశాన్ని తెలియజేయటమే రామకృష్ణుని ప్రత్యేకత: పుస్తకాల్ని వల్లె వేయటంకాక యథార్థ ఆచరణ రావాలి జీవితంలో. ఏ మతమైనా కోరేది యిదే!

పై విధంగా శ్రీరామకృష్ణుడు ఏసుక్రీస్తును దర్శించాలను కున్నాడు. ఆ మతాన్ని అనుసరించాలనే భావన కలిగిన వెంటనే బైబిలు గ్రంథాన్ని చదవమని ఏకాగ్రతతో వినేవాడు. ఆయన హృదయంలో క్రైస్తవమత భావాలు గాఢంగా నాటుకున్నాయి. ఒక రోజు శ్రీరామ కృష్ణుడు యదుమల్లికుని తోటకు వెళ్ళాడు. కొంచెంగా అటుయిటు తిరిగిన పిమ్మట, అక్కడనే ఉన్న ఒక యింటిలోనికి ప్రవేశించాడు రామకృష్ణుడు. ఆ యింటిలో ఒక గోడకు ఏసుక్రీస్తుని ఎత్తుకొని ఉన్న మేరీమాత చిత్రపటం ఒకటి ఉన్నది. అది శ్రీ రామకృష్ణుని దృష్టిని ఆకర్షించింది. తదేక దృష్టితో చూస్తున్న రామకృష్ణుడికి ఆ చిత్రపటంలో ఉన్న మేరీ క్రీస్తులు కదులుతున్నట్లు గోచరించింది. అదే భావంతో శ్రీరామ కృష్ణుడు తిరిగి దక్షిణేశ్వరానికి వచ్చాడు. కాళీదేవాలయానికి వెళ్ళ లేకపోయాడు. ఆయన మనస్సునిండా క్రైస్తవమత భావం నిండి ఉన్నది. అదే భావనతో, అదే ధ్యానంతో, అదే ఏకాగ్రతతో ఆయన మూడు రోజులున్నాడు. ఆ విధంగా పంచవటిలో మైమరచి నిశ్చలంగా కూర్చుండిన రామకృష్ణునికి ఎదుటగా ఒక వ్యక్తి వస్తున్నట్లు గోచరిం

చింది. వెంటనే రామకృష్ణుడు గుర్తు పట్టాడు. ఆయనయే ఏసుప్రభువు. అంతలో ఆ మేరీ తనయుడును, శాంతమూర్తియు, మత ప్రవక్తయు అయిన ఆ ఏసుక్రీస్తు మెల్లమెల్లన శ్రీరామకృష్ణుని సమీపించి ఆయనలో లీనమయ్యాడు. నాటితో శ్రీరామకృష్ణుని క్రైస్తవమత సాధన పూర్తి అయింది. సిద్ధి కలిగింది. నాటితో శ్రీరామకృష్ణుడు సకల సాధనా స్వరూపుడు, సర్వదేవతామూర్తి, సమస్త మత సమన్వయావతారంగా రూపొందాడు.

దాస్యమున హనుమంతు, వాత్సల్యమున రాము
కృష్ణుని మధురమున, గోపాలుడవై గోవిందు సఖ్యమున

అనురీతిగా, శాంత దాస్య వాత్సల్య మధుర భక్తి విధానాలలో ఉపాసన చేసి, ఆ యా అధిష్ఠాన దేవతల్ని సందర్శించి, సర్వ దేవ దేవీ స్వరూపుడయ్యాడు శ్రీరామకృష్ణుడు.

శా॥ మూడే రోజులలోన బుద్ధు నటులే మూన్నాళ్ళలో గ్రీస్తు, నా
మూడే రాత్రులలో మహమ్మదు, పరంబౌ నిర్వికల్పంబు, నా
మూడే నాడుల నెవ్వడైన గనెనే పూర్వంబు! దర్శించునో
నేడైనన్, గనగల్గునొక్క యికనేనిన్ రామకృష్ణ ప్రభూ!

మూడు రోజులకు ఒక్కొక్క సాధనచేసిన మహనీయమూర్తి శ్రీరామకృష్ణుడు. ఇట్టిది ఏ చరిత్రలో గోచరింపదు. సకల మత సార రసాస్వాదన చేయ గల్గిన శక్తి, సర్వమత సామరస్యాన్ని చాట గల్గిన సర్వశక్తి స్వరూపుడు శ్రీరామకృష్ణుడు. అందువలననే,

స్థాపకాయ చ ధర్మస్య సర్వ ధర్మస్వరూపిణే।
అవతారవరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః॥

సర్వధర్మ స్వరూపుడును, ధర్మ సంస్థాపకుడును, అవతార వరిష్ఠుడును అయిన రామకృష్ణునికి నమస్కారము అని శ్రీ వివేకానందునిచేతను,

సమన్వయమహాచార్యం యుగధర్మస్వరూపిణం।
సర్వదేవస్వరూపం శ్రీరామకృష్ణం నమామ్యహం॥

యుగధర్మ స్వరూపుడును, సమన్వయ మహాచార్యుడును, సర్వదేవ స్వరూపుడునైన శ్రీ రామకృష్ణునికి ప్రణామములు అని శ్రీరామకృష్ణానంద స్వామిచేతను,

సర్వ సాధన సంయుక్తం సర్వధర్మ సమన్వయం।
సకలానుభవసంపన్నం రామకృష్ణం నమామ్యహం॥

సర్వసాధన యుక్తుడును, సర్వధర్మ సమన్వయుడును, సకలానుభవ సంపన్నుడు అయిన రామకృష్ణునికి వందనములు అని అనేక విధములుగ సంస్తుతింపబడిన సమన్వయావతారుడు శ్రీరామకృష్ణుడు.

మ॥ అవలంబించిరొకొక్క మార్గమును గమ్యస్థానమున్ జేర యో
గివరేణ్యుల్ గురులైన, కాని పటుశక్తిన్నీవలెన్ సర్వ మా
ర్గవితానాంతములంది సర్వమతసౌభ్రాత్రార్థ సందేశ సా
రవిశేషంబుల దెల్పగల్గిరె! సుధీరా! రామకృష్ణ ప్రభూ!

ఒక్కొక్క గురువు ఒక్కొక్క సిద్ధాంతాన్ని స్థాపించాడు. కాని శ్రీరామకృష్ణుడుమాత్రం సకల సిద్ధాంత సమన్వయం గావించాడు. ఆ సిద్ధాంత సమన్వయంచేత మత సామరస్యం, ఆ మత సామరస్యంచేత సమత్వం, ఆ సమత్వంచేత సకలహృదయ సమ్మేళనం, ఆ సమ్మేళనం చేత ప్రశాంతి లభిస్తాయి.

మొదట సమస్త సిద్ధాంత రహస్యాల్ని సక్రమంగా గ్రహించాలి. ఆ పైన సర్వ సాధనలను చేయాలి. అప్పుడు సర్వ ధర్మ సమన్వయం ఏర్పడుతుంది. అప్పుడే సకలానుభవ ప్రాప్తి. శ్రీరామ కృష్ణునిలో అంతా సర్వ సమన్వయమే గోచరిస్తుంది. బోధించటంలో భేదదృష్టియేగాని అనుభవంలో అంతా అభేదత్వమే! అనుభవంలో రాగ ద్వేషాలు లేవు. అనుభవంలో ఈర్ష్యాసూయలు లేవు. అనుభవంలో ఖండనమండనాలు లేవు. సాధనలో భేదములుగాని సిద్ధత్వంలో ఉండ వనునదియే పర్యవసానం. ఆ దివ్యానుభవ రహస్యాన్ని గ్రహించలేని పామరులు, వానిని వ్యక్తిగత భేదములనియు, అనుభవంలో ఉన్న తారతమ్యాలనియు చెప్పుచు, తాము భేదంతో వ్యవహరిస్తూ, యితరు లకును భేదాభిప్రాయాన్ని కల్పిస్తుంటారు. సుసంస్కారవంతులు దీన్ని గ్రహింపగలరు.

పై విధంగా శ్రీరామకృష్ణుడు శాక్తేయాన్ని, శైవాన్ని, వైష్ణవాన్ని గ్రహించి, సకల దేవతల్ని, సాక్షాత్కరింపజేసికొన్నాడు గదా! ఈ సర్వమత సాధనలచేత, ఈ సకలదేవతా సాక్షాత్కారం చేత ప్రయోజనం ఏమిటి? ఆయన విశిష్టత ఏమిటి?

'యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా। నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః॥' 'యా దేవీ సర్వభూతేషు ప్రేమ రూపేణ సంస్థితా। నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః॥' 'యాదేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా। నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః॥ సర్వభూతాంతర్గతం అయిన శక్తిని ప్రేమ మూర్తిగా, మాతృదేవతగా మలుచుకొని, ఆ దృఢ భావంతోనే ఆరాధించి, పసిబిడ్డవలె విలపించి, 'అమ్మా! అమ్మా!' అని ఆవేదన చెందిన రామకృష్ణుడు, ఆ కాళికాదేవిని సృష్టి స్థితి లయకారిణిగా గాక లోకమాతగనే దర్శించి, ఆమె వాత్సల్యామృతాన్ని చూరగొన్నాడు. భగవంతుని మాతృమూర్తిగా జూచుటచే నెట్టి అపవిత్రతయు, దరికి జేరదుగదా! సర్వశక్తిమయి, సర్వప్రేమమయి, సర్వలోకమయి, సర్వజీవమయి, సర్వభూతమయి అయిన శక్త్యుపాసన చేసినవానికి యితర దేవతా సాక్షాత్కారం అవసరం లేదు. ఆ దేవతామూర్తు లెల్లరు ఆ శక్తిరూపములే. అయినను అనుభవంతో గ్రహించి పలుకుట మంచిదని శ్రీరామకృష్ణుని అభిప్రాయమై యున్నదేమో! యాత్రచేసి చక్కగా చేసి వచ్చి చెప్పినవాని మాటలకు, 'యాత్రామార్గదర్శి' అనే పుస్తకాన్ని చూచి చెప్పినవానికి తారతమ్యం ఎట్లా ఉంటుందో అదే విధంగా అనుభవం పొందినవాని ప్రబోధకు, కేవలం గ్రంథావలోకనం చేసినవాని బోధకు అంత భేదం ఉంటుంది. ఆద్య శక్త్యారాధనచేత సర్వశక్తియుతుడై చెలువొందాడు శ్రీరామకృష్ణుడు. శ్రీరామకృష్ణ దేవుని శాక్తేయ సాధనా విశిష్టత యిందు ప్రస్ఫుటంగా ద్యోతకం అవుతున్నది. శాక్తసాధనచేత శక్తిస్వరూపుడయ్యాడు రామకృష్ణుడు. అందుచేతనే సకల తంత్ర రహస్యాల్ని గ్రహించి, భగవతికి పసిబిడ్డయై, సర్వస్త్రీలోకాన్ని మాతృదేవతగ దర్శించగలిగాడు ఆయన.

బాల్యంలోనే శివరాత్రి రోజున శివ సాక్షాత్కారాన్ని పొంది, నాడే ఆ ఆనందామృత రసాస్వాదన గావించి, త్యాగ, వైరాగ్య, సమాధి, విషయ విముఖత్వాది శంకర గుణగణాల్ని అవలంబించి, సాధించిన శైవమత నిష్ణాతుడు శ్రీరామకృష్ణుడు.

శ్రీ రఘురాముని యందు అనన్య భక్తి, భగవద్విషయాసక్తి, బ్రహ్మచర్య పరిపాలనం, చురుకుదనం, సమయస్ఫూర్తి, శక్తియుక్తులు హనుమదుపాసనచేత సాధించాడు శ్రీరామకృష్ణుడు. కష్ట సహిష్ణుత, నిరాడంబరత, క్షమ, త్యాగం సీతాసాధ్వి సందర్శనంచేత పొందాడు శ్రీరామకృష్ణుడు. ధర్మతత్పరత, సత్యవాక్యపాలన, ద్వంద్వ సహిష్ణుత, నిర్లిప్తత, దయాదికములు శ్రీ రామోపాసన వలన పొందాడు శ్రీరామకృష్ణుడు. అవ్యభిచార భక్తి, నిర్మలప్రేమ, భక్తి తత్పరతలు రాధికాదేవి సందర్శనచేత సంపాదించాడు శ్రీరామకృష్ణుడు. నిష్కామత్వం, అమాయకత్వం, పసితత్వం, కళావైదుష్యం, జగద్గురుత్వం, జ్ఞాన సంస్థితి, అతీత తత్త్వాల్ని శ్రీకృష్ణపరమాత్మ సాక్షాత్కారం చేత పొందాడు శ్రీరామకృష్ణుడు. ఆయనకున్న ఆ యా సల్లక్షణాలు ఆ యా ఉపాసనలద్వారా మనకు వ్యక్తం అయ్యాయి. శాంత దాస్య సఖ్య వాత్సల్య మధురభక్తి పంచకంచేత వైష్ణవ సాధనలద్వారా వైష్ణవ మతావలంబియై వైష్ణవుడయ్యాడు శ్రీరామకృష్ణుడు.

తర్వాత సర్వ సౌభ్రాతృత్వాదికం మహమ్మదీయంద్వారా, శాంతి ప్రేమల క్రైస్తవంద్వారా పొందిన ధన్యాతిధన్యుడు శ్రీరామకృష్ణుడు. ఈ విధంగా ఆయన సర్వసాధనావతారం అనటంలో, సర్వ దేవదేవీస్వరూపుడు అనటంలో ఏ విధమైన సందేహం లేదు. ముమ్మాటికి లేదు, లేదు, లేదు.

పైవిధంగా సకల దేవతోపాసనలతో సర్వ సల్లక్షణోపేతు డైన శ్రీరామకృష్ణుడు తన దరికి జేరిన శిష్యుల్ని పరీక్షించి. ఒక్కొక్క రికి ఒక్కొక్క దేవతా మంత్రాన్ని ఉపదేశించి, ఆ యా సాధనా విధా నాలను వారికి బోధించి, అందు వారిని నిష్ణాతుల్నిగా తయారు చేయ గలిగాడు.

దృష్టిచే స్పర్శచే తలపుచే వాక్కుచే
దివ్యాత్మ సముఁను దావ్రవజేసి

అనురీతిగా దృష్టిచే గొందరికి, మరికొందరికి స్పర్శచే, కొందరికి భావనచే, యింకా కొందరికి వాక్కుచే వారి వారి ఇష్టదైవ దర్శన భాగ్యాన్ని ప్రసాదించిన అవతారవర్యుడు, గురుపుంగవుడు శ్రీరామ కృష్ణ దేవుడు. ఇది అందరికి సాధ్యం కాదు.

అనేకమంది ఉపాసకులకు శ్రీరామకృష్ణుడు వారి వారి ఉపాస్యమూర్తులుగ సాక్షాత్కరించి, వారిని అనుగ్రహించి, ఆనందింప జేసినట్లుకూడ స్పష్టంగా తెలుస్తున్నది. ఎవరెవరు ఎటువంటి మహ ద్భాగ్యాన్ని పొందారో చూద్దాం.

భైరవీ ప్రార్థింప ప్రేష్ఠ రూపము దాల్చి
భూతాంతరాత్మవని ప్రకటపరచి
అఘోరమణి గోర శ్రీకృష్ణరూపమున
అవ్యయ ప్రేమమున నాడినావే

మధుర ధన్యుని జేయ నర్ధనారీశ్వరుగ
మధురరూపము దాల్చి మహిమ జూపి
శారదామాయికిని శక్తి కాళిగ దోచి
సత్యస్వరూపంబు చాటినావె

భైరవి బ్రాహ్మణికి ఆమె ఇష్ట దైవమైన శ్రీరామచంద్రునిగను, అఘోరమణీ దేవికి శ్రీ కృష్ణ పరమాత్మగను, మధురనాథుడికి అర్ధ నారీశ్వరునిగను, శ్రీ శారదా దేవికి శక్తి స్వరూపిణియైన కాళికా దేవిగా, శ్రీ గౌరీమాయికి శ్రీ కృష్ణ చైతన్య మహాప్రభువుగా దర్శనం అనుగ్రహించిన శ్రీరామకృష్ణుడు సర్వ దేవతా స్వరూపుడే। అట్టి మహాత్ముడు మన భారత దేశంలో జన్మించటమే ఒక మహద్భాగ్యం। అట్టి దివ్య మూర్తిని అనుసరించటమే ఒక పుణ్య విశేషం। ఆయన మన భారతీయ సంస్కృతికి శిరోభూషణం!

శ్రీరామకృష్ణ దేవుని చరిత్రలో బహిర్గతం అయినవి కొన్ని మాత్రమే। ఇంకా మనకు తెలియనివి ఎన్నో। ఆ మహానుభావుడు ఏ ఏ పుణ్యాత్ములకు ఏ ఏ రూపంలో దర్శనం యిచ్చాడో మనకు తెలియదు గదా। ఆ యా విషయాలు మనకు తెలియాలంటే మనంకూడా అంత ఎత్తుకు ఎదగాలి. అంటే ఆ లక్షణాలు రావాలి గదా!

శక్తియాతడే శంకరుడు నాతడే
శ్రీరాముడాతడే శ్రీకృష్ణుడాతడే
సర్వదేవ దేవిరూపధారుడాతడే

అని సర్వ దేవదేవీస్వరూపుడుగా సర్వులచే కీర్తింపబడినవాడు శ్రీరామకృష్ణుడు. రామోపాసన ఎలా చేయాలి అంటే దానికి ఆదర్శంగా ఉంటాడు రామకృష్ణుడు. కృష్ణభక్తిని సాధించాలంటే రామకృష్ణుడు ఆదర్శం. శక్త్యారాధన ఎలాగ అంటే అందులో ఆదర్శం రామకృష్ణుడు. ఈవిధంగా సర్వాదర్శమూర్తి శ్రీరామకృష్ణుడుగదా!

మహమ్మదీయులు, క్రైస్తవులు శ్రీరామకృష్ణుని సన్నిధికి వచ్చేవారు. వారి వారి మత ప్రవక్తలను ఆయనలో దర్శించి, ఆనందించి, తృప్తిని పొంది, ఆయనతో కొంతకాలం నివసించేవారు. ఆయన సర్వమత సామరస్యానికి జోహారులు అర్పించేవారు. నాటి బ్రహ్మసమాజ మతస్థుల రాకకు యిదియే కారణమేమో!

వైష్ణవ చరణుడు, గౌరీపండితుడు మున్నగు శాక్తేయులును ఆ తంత్రానుభవమూర్తిని ఆశ్రయించి తమకు తెలియని అనేక విషయాల్ని గ్రహించుకొని, శ్రీరామకృష్ణునివద్ద నిరహంకారులై ఉండేవారుగదా!

అఖిల సాధనమ్ములందు ఆరితేరెనే
అనుభవానందమందు మునిగియుండునే

అనువిధాన అనేకమంది సర్వ సంప్రదాయ సన్న్యాసులు, అనేకమంది మహాపండితులు శ్రీరామకృష్ణునిజేరి, వారి వారి సందేహములను నివారణ చేసికొనెడివారు. నాడు, నేడుకూడ సర్వమతస్థులు, సకల సంప్రదాయస్థులు, ఉపాసకులు, అద్వైతులు శ్రీరామకృష్ణుని ఆదర్శంగా గ్రహించి, ఆరాధిస్తున్నారు. ఎందుచేత?

ద్వైతాద్వైత సిద్ధాంత పరమావధీ
శుద్ధాత్మైక సాధన సంపన్నధీ
అనుభవ పెన్నిధి, ఆనందాంబుధి

అనురీతిగా ద్వైతాద్వైతానుభవసంపన్న మూర్తిగా వెలుగొంద టమే కారణం. ఇట్టి సర్వ సమన్వయమూర్తి మరొకరు కానరారు.

విద్యావంతుడైన విద్యాదానం, బలవంతుడైన శక్తి ప్రదానం, ధనికుడైన ధనదానం చేస్తారుగదా లోకంలో. ఆ యా శక్తి కలవారు ఆ యా కార్యాల్ని నిర్వహిస్తేనే అందంగా ఉంటుంది. అదే విధంగా గురుత్వంకూడ. అనుభవ సంపదతో తులతూగినవాడే 'గురు' పదార్హుడు. రాగద్వేషాలను వీడి, కాంక్షల నశింపజేసికొని, వైరాగ్య భూషితుడై, సాధకుడై, సిద్ధుడై, అనుభవంతో విరాజిల్లేవాడు గురువరేణ్యుడు. 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' అనిగదా శ్రుతివాక్యం! అట్టి సద్గురువును గాంచినంతనే సచ్ఛిష్యునికి తాను యథార్థ శిష్యుడు కావాలనే భావన ఉదయించాలి. వైరాగ్యం అభివృద్ధి చెందాలి. భగవంతునికై తపించాలి. సాధనకై ఆరాటం చెందాలి, శాస్త్రజ్ఞానంయొక్క అవశ్యకత్వాన్నిగ్రహించాలి. అనుభూతికై ఆవేదన పొందాలి. ఇదియే యథార్థ. గురుశిష్య సంబంధం! ఇట్టి గురుశిష్యులనుండి జ్ఞానం ప్రవహిస్తుంది. ప్రపంచానికి శాంతి లభ్యం అవుతుంది. పై లక్షణాలు లేనిచో అజ్ఞానం అధికం అయి, విభేదత్వం ఏర్పడి, అశాంతి కలుగుతుంది. అవలే అజ్ఞానంలో మగ్గుతున్న ప్రజానీకానికి యింకా అజ్ఞానం పెంచే అవకాశం కలుగుతుంది.

ద్వైతాద్వైతపు మధువు నపారముగా గల శ్రీరామకృష్ణ
పారిజాతమును మధుపచయము వలె జేరజొచ్చె బహు శిష్య
సమూహము

సుగంధంతో కూడిన కమలం వికసించగానే అందున్న మకరం దాన్ని గ్రోలటానికి తేనెటీగలు చేరే విధంగా సకలానుభవ స్వరూపుడగు శ్రీరామకృష్ణుడను నొక ఆధ్యాత్మిక పద్మం వికసించింది. అందున్న అనుభవామృతాన్ని ఆస్వాదించటానికి శిష్య సమూహం రాసాగింది. అది గురుత్వంకోసం శ్రీరామకృష్ణుని తపన కాదు. అది భగవతీ కాళికా మాయి సంకల్పం.

ఒక్క సాధన చేసి, ఒక్క అనుభవాన్ని పొందిన వాడు గురువుకదా! సకల సాధనల గావించి, సర్వానుభవ సంపదల మునిగినవాడు జగద్గురువు. ఏ సాధన లేక, ఏ అనుభవం లేక ఉపదేశాలు చేస్తూ శిష్యులకై పాకులాడేవారిని ఏమనాలో మరి!

యథార్థ, గురు వ్యక్తిత్వాన్ని, శ్రేష్ఠత్వాన్ని వివరించటానికో అన్నట్లుగా శ్రీ శారదానంద స్వామి శ్రీరామకృష్ణునిగూర్చి ఒక శ్లోకం వ్రాసి ధన్యుడయ్యాడు.

సర్వ ధర్మ స్థాపస్త్వం సర్వ ధర్మ స్వరూపకః।
ఆచార్యాణాం మహాచార్యో రామకృష్ణాయ తే నమః॥

సర్వ ధర్మ స్వరూపకుడును, సర్వ ధర్మ స్థాపకుడును, ఆచార్యులలో మహాచార్యుడైన రామకృష్ణునికి నమస్సులు. సద్గురువు

లభించడం సాధకుని మహాదృష్టం. అట్టి అదృష్టం ఏ కొద్దిమందికో లభిస్తుంది. అట్టి వారు కోటికొక్కరు ఉంటారేమో! అట్టి వారిని చూచే అదృష్టంకూడా గ్రహించుకునే అదృష్టం అందరికి కలుగదు. అందుచేతనే 'అనేక జన్మ సంసిద్ధిః' అన్నది శాస్త్రం.

ఇక అట్టి సకలానుభవ చక్రవర్తి యనదగిన ఆ శ్రీరామకృష్ణుని సన్నిధానంలో ప్రవేశించి ఒక్కసారి చూచి ఆనందిద్దాము.

పండిత పామరులేకమైరి యట పేదలు ధనవంతులును కలిసిరి
సర్వ జాతులును సర్వ మతస్థులు సర్వ వర్ణములు భక్తితో జేరిరి

శ్రీరామకృష్ణుని సన్నిధానంలో జాతి మత వివక్షతలు లేవు! అచ్చట పండిత పామర తారతమ్యం అగోచరం! అచట ధనిక పేద భావం అభావం! అచ్చట స్త్రీ పురుష దృష్టిలేదు! అచ్చట మత వ్యత్యాసం అగోచరం! అంతా సర్వ సమన్వయమే! అంతా సర్వ సమత్వమే!

నాడు కలకత్తా నగరంలో ఉన్న సంఘ సంస్కర్తలు, బ్రహ్మ సమాజ సంస్థాపకులు, నాటక రచయితలు, ధనికులు, ఉన్నత పదవులలో ఉన్నవారు, భక్తులు, జ్ఞానులు, ఉపదేశకులు, ఇంకను అనేకమంది శ్రీరామ కృష్ణుని సన్నిధిలో తమను తాము మరచి ఉండే వారు. అట్టి వారిలో కేశవచంద్ర సేన్, మహేంద్రనాథ గుప్త, వైష్ణవచరణుడు, గౌరీపండితుడు, మధురనాథుడు, గిరీశచంద్రఘోష్, రామచంద్రదత్త, సురేశనాథ మిత్ర, బలరాం బోస్, దుర్గాచరణ నాగ్ మొదలైవారు శ్రీరామకృష్ణ దేవునికి దాసానుదాసులై, ఆయన సమాధి సంస్థితుల వీక్షించుచు, ఆయన దివ్య పారమార్థిక సంభాషణల వింటూ, ఆయన గాన మాధుర్యానికి పర

పశులవుతూ, ఆయన గాఢ భక్తి పారవశ్యాలకు తన్మయత్వం చెందుతూ, ఆయన సంకీర్తనతో కూడిన నృత్యానికానందిస్తూ, తమ తమ గృహస్థ జీవితంలో మమకార రహితంగా జీవిస్తూ, శ్రీరామకృష్ణుని ఆదర్శాలను హృదయంలో నింపుకుని, ఆదర్శ గృహస్థులుగా తయారై, వారి జీవితాల్ని పునీతం చేసుకున్న ధన్య జీవులు. పురుషుల వలెనే స్త్రీలును శ్రీరామకృష్ణుని ఆదర్శంగా భావించి తమ జీవితాన్ని పునీతం చేసుకున్నారు.

లింగభేదమంచు బుద్ధి వెదకినలేదే!
ధనముబట్టి తారతమ్య మెంచుటలేదే!
పండితులను చేరదీయు పద్ధతి లేదే!

అనువిధాన సర్వ సమత్వం ఆ శ్రీరామకృష్ణ దేవునిలో, ఆయన సన్నిధిలో నృత్యం చేస్తున్నట్లున్నది. సర్వ సమత్వం, సమత్వం పొందినవారి సాన్నిధ్యంలోనే కలుగుతుంది. అదే వారి విశిష్టత విద్యావంతులు యువకులనేకులు విషయవాంఛలను బేరు ప్రతిష్ఠల లౌకిక జీవితమెల్ల త్యజించి ఏక నిష్ఠతో రామకృష్ణునే గురూత్తమునిగ నమ్మి గొల్చుచు గురుముఖజనితసుధావాక్యమ్ముల గోలి తన్మయత నాట్యము సల్పరి ఘోరతపంబుల కాలము గడిపిరి.

శ్రీరామకృష్ణుని ఆశ్రయించిన గృహస్థులు పైన చెప్పినట్లు తమ జీవితాల్ని ఆదర్శప్రాయంగా మలుచుకొన్నారు. కాని శ్రీరామకృష్ణుని కామకాంచన త్యాగ విశిష్టతను, వైరాగ్యాన్ని, సాధనా పటుత్వాన్ని చూచిన లౌకికదృష్టిగల ధనవంతులు, విద్యావంతులైన సుసంస్కార యుతులైన యువకబృందం, విషయ సుఖాలను వర్జించి, త్యాగ వైరాగ్యోపేతులై, ఆధ్యాత్మికజ్ఞాన పిపాసువులై, శ్రీరామకృష్ణుని

సర్వతోముఖ ప్రజ్ఞనుచూచి, ఆయనను జగద్గురువుగా విశ్వసించి, ఆయనకు శిష్యులై, బహుముఖ ప్రజ్ఞనార్జించి, అనేక ముఖ్యసాధనల తీవ్రంగా చేశారు. వారందరూ భావిజీవితంలో యతివరేణ్యులై, శ్రీరామకృష్ణుని సర్వమత సమన్వయ సందేశాన్ని ప్రపంచానికి అందించిన మహానుభావులే! శ్రీరామకృష్ణుని సన్న్యాస శిష్యులు పదునేడు గురు. స్త్రీలలోగూడ నాడే శ్రీ శారదాదేవిని ఆదర్శంగా గ్రహించిన గౌరీమాయి, గోలప్‌మాయి, యోగీనీమాయి, మొదలైన సన్న్యాసినులు ఉన్నారు. వారంతా శ్రీరామకృష్ణుని అవతారవర్యునిగా గ్రహించి, ఆయన అనుగ్రహాన్ని పొందిన ధన్యజీవులే!

స్పర్శమాత్రిన సర్వభవముల సర్వనాశనకారకుడ పై
నిర్వికల్పసుధా ప్రవాహము చేర్పజాలెడు స్పర్శవేది.

అనువిధంగా భవబంధాల్ని ఛేదించగల శక్తిసామర్థ్యాలు కలిగించేది ఆయన దివ్య కరస్పర్శ! ధ్యానం కుదరక తపిస్తున్న సాధకులకు ఏకాగ్రతను కలిగించేది ఆయన దివ్యకరస్పర్శ! లౌకిక బాధల మ్రగ్గుచు పరితపిస్తున్న ఆపేదనాపరులకు అమూల్యజ్ఞాన సంపదను ప్రసాదించేది ఆయన దివ్య కరస్పర్శ! వేయేల? ఆధ్యాత్మిక గమ్యం అయిన నిర్వికల్ప సమాధ్యనుభూతినే శ్రీ వివేకానందునికి అనుగ్రహించింది ఆయన దివ్య కరస్పర్శ! అదియే ఆ గురువరేణ్యుని మహత్వం! అదియే ఆ గురుపుంగవుని ఉన్నతాధ్యాత్మిక సంపద! అదియే ఆ గురువర్యుని సర్వతోముఖ ప్రతిభ! అట్టి విశాల విశ్వతోముఖత్వ ప్రజ్ఞాశాలి శ్రీరామకృష్ణదేవుడు. ఆ ప్రజ్ఞ భగవద్దర్శనం వలన లభిస్తుంది. ఆ ప్రజ్ఞ అమానుష. సాధనల ఫలితం! ఆ ప్రజ్ఞ అస్ఖలిత బ్రహ్మచర్యంవలన లభిస్తుంది! ఆ ప్రజ్ఞ అద్వైతానుభవ జనితం!

ఆ ప్రజ్ఞ యీ లౌకిక విద్యలవల్ల అలభ్యం. ఈ లౌకిక విద్య
మనస్సు వికసిస్తుందేమోకాని హృదయం వికాసం చెందదు.
వికాసంవల్ల సుఖం లభ్యకాని హృదయ వికాసంవల్ల ఆనందం ల
శాస్త్రాధ్యయనంచేత మనోవికాసం చెందిన సాధకుడు అనుభవ
హృదయ వికాసం, హృదయ విశాలత్వాలను అందుకుంటాడు.
వల్లనే 'హృదా మనిషా' అని శాస్త్రం. అట్లుకాక కేవలం
వికాసం లభించినా సంకుచితత్వం తొలగదు. సర్వజ్ఞత్వం సమా
భూతిపరుడైన సిద్ధునికిమాత్రమే సాధ్యం.

పూర్వ చరిత్రల పూర్తివెదికిన నేటి లోక గురుకోటిని జూచి
నిన్నుబోలు గురులెన్న మహాత్మా! నీకు నీవేగద నిక్క...

అని ఆ జగద్గురువు. సమరసమూర్తి. శాంతి ప్రద
రామకృష్ణుడు కీర్తింపబడుట యధార్థ సత్యం.
లోకకళ్యాణమై శోకదేహము దాల్చి
సాకార బ్రహ్మంబు సాక్షియును నాతడే

అనునట్లు లోక శ్రేయస్సుకోసం ఆ మహాత్ములు మూల్లోక
జన్మిస్తారు. బాధామయమైన యీదేహాన్ని ధరిస్తారు. వారు మనకో
యిన్ని బాధలు చెందుతూ, మనకు మూర్తిని యివ్వటానికి ఎ
ఉపాయాలు చెప్పుతారుగదా! మనం నిజంగా వారి ఋణం తీ
కుంటున్నామా? వారు పుట్టినప్పుడు కనిసం మనం పుట్టే అవకా
లేకున్నా కనీసం వారి ప్రబోధాలనైనా చదువు కుంటున్నామా? కనీ
వినగలుగుతున్నామా? వారు మనకోసం వారి సుఖాలన్నీ త్యాగం
వస్తే మనం ప్రాపంచిక విషయత్యాగం చేయకపోగా వారినే త్యా

చేస్తున్నాం. అంటే మన అభివృద్ధినే మనం దూరం చేసుకుం అన్నమాట?

శిష్టవరులను రక్షసేయగ దుష్ట జనులను శిక్షసేయగ
యుగయుగంబున నవతరించెడు సగుణమూర్తివి శ్రీ జ

దుష్ట శిక్షణ శిష్ట రక్షణార్థం ప్రతియుగంలో ఒక మహాత్ముడు జనిస్తుంటాడు. అందువల్లనే యిదే భావాన్ని 'పరి సాధూనాం వినాశాయ చ దుష్కృతాం అని గీతలో కృ ప్రబోధించాడు. తమో గుణంలో స్థూలరూపమైన దుష్ట శి రక్షణలు, రజోగుణంలో సూక్ష్మరూపమైన దుష్ట సంస్కార శిష్ట సంస్కార పోషణలు. సత్త్వగుణంలో దుష్ట శిష్ట సంరక్ష దుష్టులనుకూడ రక్షణ చేస్తాడు భగవానుడు. శ్రీరామకృష్ణ సత్త్వసంబంధమైన కార్య నిర్వహణకే అవతరించాడనటం ఆయన జీవితంలో దుష్టరక్షణయే ప్రధానంగా గోచరిస్తుంది.

పై విధంగా యీ స్థూల శరీరాన్ని మనకై ధరిం సాధనజేసి, మనకై సిద్ధత్వాన్ని పొంది, మనకై ఆపేద ఆ శ్రీరామకృష్ణుని శరీరంలో రుగ్మత ప్రవేశించింది. శరీ బాధలు తప్పవుగదా! శ్రీరామకృష్ణుని కంఠంలో వ్రణ దేవితో సంభాషించింది ఆ కంఠమే! అనేక సాధన విషయా మందికి వివరించింది ఆ కంఠమే! అనేక హాస్యోక్తులతో ఆనందింపజేసింది ఆ కంఠమే! అనేక మందిని ప్రేమతో ర దరిజేర్చు కొన్నది ఆ కంఠమే! ఆ కంఠంలోనే నే తయారైంది.

ఆ ప్రజ్ఞ యీ లౌకిక విద్యలవల్ల అలభ్యం. ఈ లౌకిక విద్యలవల్ల మనస్సు వికసిస్తుందేమోకాని హృదయం వికాసం చెందదు. మనో వికాసంవల్ల సుఖం లభ్యకాని హృదయ వికాసంవల్ల ఆనందం లభ్యం. శాస్త్రాధ్యయనంచేత మనోవికాసం చెందిన సాధకుడు అనుభవంచేత హృదయ వికాసం, హృదయ విశాలత్వాలను అందుకుంటాడు, అందువల్లనే 'హృదా మనిషా' అని శాస్త్రం. అట్లుకాక కేవలం మనో వికాసం లభించినా సంకుచితత్వం తొలగదు. సర్వజ్ఞత్వం సమాధ్యను భూతిపరుడైన సిద్ధునికిమాత్రమే సాధ్యం.

పూర్వ చరిత్రల పూర్తివెదకిన నేటి లోక గురుకోటిని జూచిన
నిన్నుబోలు గురులెన్నె మహాత్మా! నీకు నీవేగద నిక్కముసాటి

అని ఆ జగద్గురువు. సమరసమూర్తి. శాంతి ప్రదమైన
రామకృష్ణుడు కీర్తింపబడుట యధార్థ సత్యం,
లోకకళ్యాణమై శోకదేహము దాల్చు
సాకార బ్రహ్మంబు సాక్షియును నాతడే

అనునట్లు లోక శ్రేయస్సుకోసం ఆ మహాత్ములు మాల్లోకంలో జన్మిస్తారు. బాధామయమైన యీదేహాన్ని ధరిస్తారు. వారు మనకోసం యిన్ని బాధలు చెందుతూ, మనకు మూర్తిని యివ్వటానికి ఎన్నో ఉపాయాలు చెప్పుతారుగదా! మనం నిజంగా వారి ఋణం తీర్చు కుంటున్నామా? వారు పుట్టినప్పుడు కనిసం మనం పుట్టే అవకాశం లేకున్నా కనీసం వారి ప్రబోధాలనైనా చదువు కుంటున్నామా? కనీసం వినగలుగుతున్నామా? వారు మనకోసం వారి సుఖాలన్నీ త్యాగంచేసి వస్తే మనం ప్రాపంచిక విషయత్యాగం చేయకపోగా వారినే త్యాగం

చేస్తున్నాం. అంటే మన అభివృద్ధినే మనం దూరం చేసుకుంటున్నాం అన్నమాట?

శిష్టవరులను రక్షసేయగ దుష్ట జనులను శిక్షసేయగ
యుగయుగంబున నవతరించెడు సగుణమూర్తివి శ్రీ జగద్గురో!

దుష్ట శిక్షణ శిష్ట రక్షణార్థం ప్రతియుగంలో ఒక్కొక్క మహాత్ముడు జనిస్తుంటాడు. అందుచేతనే యిదే భావాన్ని 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం అని గీతలో కృష్ణుడుకూడా ప్రబోధించాడు. తమో గుణంలో స్థూలరూపమైన దుష్ట శిక్షణ శిష్ట రక్షణలు, రజోగుణంలో సూక్ష్మరూపమైన దుష్ట సంస్కార వినాశం, శిష్ట సంస్కార పోషణలు. సత్త్వగుణంలో దుష్ట శిష్ట సంరక్షణ అనగా దుష్టులనుకూడ రక్షణ చేస్తాడు భగవానుడు. శ్రీరామకృష్ణుడు యీ సత్త్వసంబంధమైన కార్య నిర్వహణకే అవతరించాడనటం సుస్పష్టం. ఆయన జీవితంలో దుష్టరక్షణయే ప్రధానంగా గోచరిస్తుంది.

పై విధంగా యీ స్థూల శరీరాన్ని మనకై ధరించి, మనకై సాధనజేసి, మనకై సిద్ధత్వాన్ని పొంది, మనకై ఆవేదన చెందిన ఆ శ్రీరామకృష్ణుని శరీరంలో రుగ్మత ప్రవేశించింది. శరీరధారికి యీ బాధలు తప్పవుగదా! శ్రీరామకృష్ణుని కంఠంలో వ్రణం లేచింది. దేవితో సంభాషించింది ఆ కంఠమే! అనేక సాధన విషయాల్ని అనేక మందికి వివరించింది ఆ కంఠమే! అనేక హాస్యోక్తులతో శిష్యుల్ని ఆనందింపజేసింది ఆ కంఠమే! అనేక మందిని ప్రేమతో రమ్మని పిలిచి దరిజేర్చు కొన్నది ఆ కంఠమే! ఆ కంఠంలోనే నేడు వ్రణం తయారైంది.

ఈ స్థితిని గమనించిన శిష్యులు ఆందోళన చెందారు. ఆయనను దక్షిణేశ్వరంనుండి చికిత్సకై కాశీపూర్ కు తీసుకొని వెళ్ళారు. గురుదేవుని చికిత్సకోసం వైద్యుని ఏర్పాటు గావించారు గృహస్థ శిష్యులు. గృహస్థులు ఆయన చికిత్సకు వలయు ఖర్చులను భరింపగా, యువక శిష్యవర్గం ఆయనకు అహర్నిశలు సేవలు చేస్తూ, పరస్పర సహకారంతో మెలిగేవారు. శిష్యులందరూ ఎంతో వ్యథ చెందేవారు. పైకి గంభీరంగా ఉన్నట్లు గోచరించినా ఆ శిష్యబృందం అమిత ఆవేదనకు గురి అయ్యేవారు. శ్రీరామకృష్ణునికి నానాటికి వ్యాధి అధికం అవుతున్నదేకాని తగ్గుముఖం కాలేదు. అయినను ఆయన మనస్సు మాత్రము సదా దేవియందే మగ్నం అయి ఉన్నది. ఆయన దివ్యానుభూతులు ఏ మాత్రము తగ్గలేదు. ఆయన సమాధిసంస్థితులు యధాపూర్వమే! శిష్యవాత్సల్యంతో ప్రసంగాలు సాగుతునే ఉన్నాయి. శరీరమెంత వ్యాధితో నున్ననూ ఆయన ముఖంలో చిరునవ్వు నాట్యం చేస్తుండేది. దేవ్యానందామృతపానరసాస్వాదనామగ్నుడైన ఆయనకు చింత ఎక్కడిది? నీర క్షీరములలో నీరమును వదలి క్షీరమునే గ్రోలిన రాజహంస వలె లౌకికాలౌకికములలో లౌకికమును వదలి అలౌకికానందమునే పొందినవాడు ఈ పరమహంస చంద్రుడు. అట్టి ఆ శ్రీరామకృష్ణుడు శరీరత్యాగానికి ముహూర్తాన్నికూడా నిర్ణయించుకున్నాడు. అది వారి పరిపూర్ణత్వానికి చిహ్నం! అది వారి నిర్లిప్తతకు చిహ్నం! నాటకం పూర్తికాగానే నటకుడు, తాను పూసుకున్న రంగుల్ని తుడుచుకున్నట్లు మహాత్ములుకూడ యీ లోకం అనే రంగస్థలంపై తమనటన పూర్తికాగానే తాము తాత్కాలికంగా వేసుకున్న వేషాల్ని వదలి స్వస్వరూపాన్ని ధరిస్తారు. పాత్రధారుడు తాను వేసుకున్న పూతలను తుడుచుకొన్నందుకు బాధ చెందడు. అదేవిధంగా మహాత్ములు యీ శరీరాన్ని త్యజించునప్పుడు దుఃఖింపరు. ఇది నాటకం అని వారికి యధార్థం తెలుసుకదా!

పదునెన్మిది నూర్ల యెనుబదియారున పదునారవ తేది యగస్టునెలలో
జగద్గురుండును సర్వ సౌశ్రేష్ఠయుగ సగుణనిర్గుణాతీతుండగు మన
రామకృష్ణుడు తన యవతారము లయమొనరించెను మహాసమాధిలో.

శ్రీరామకృష్ణుడు 1886 వ సంవత్సరం, ఆగష్టు 16వ తేదీని, తన అవతార ప్రయోజనాన్ని ముగించుకొని, పరబ్రహ్మంలో విలీనం అయ్యాడు. శిష్యులందరు దిగులు చెందారు. తల్లి లేని బిడ్డలవలె విలపించారు. గురు శిష్య సంబంధం తల్లిబిడ్డల సంబంధంవంటిది. అది పవిత్రాతిపవిత్రమైనది. మాతృమూర్తివోలె శిష్యుల శారీరక, మానసిక వ్యధల్ని దూరం చేసిన ఆ శ్రీరామకృష్ణ గురువరేణ్యుని నిర్యాణంవలన కలిగిన దుఃఖం వారికి ఎంత బాధ కలిగించిందో హృదయం కలవారికే అర్థం అవుతుంది. అందరూ గ్రహింపలేరు. ఆ బాధలోనే ఆ యువక శిష్యబృందం వారి కర్తవ్యాన్ని గుర్తు తెచ్చుకున్నారు. మనోశరీర వాక్కాయముల తమ గురుపుంగవుని విశ్వసించారు. విషయ సుఖాల్ని దూరం చేశారు. ప్రాపంచిక జీవిత అనిత్యత్వాన్ని గ్రహించుకున్నారు.

యతివరుడగు శ్రీరామకృష్ణుని ప్రథమ శిష్యుడౌ నరేంద్రనాథుని
అనుసరించుచు యువక బృందము మునిగణములలో వన్నెకెక్కిరి.
నామ రూపముల మార్పు చేసిరి కామవివర్జిత మార్గము దొక్కిరి.

అట్టి కామకాంచన విజేతయైన రామకృష్ణుని శిష్యవర్గం మరల సంసారంలో ప్రవేశింపలేదు. వారు శ్రీరామకృష్ణుని సన్నిధిలో ఆధ్యాత్మిక మకరందాన్ని రుచి చూడటం చేత యీ లౌకిక విషయాలు వారికి వెగటుగా తోచాయి. శ్రీరామకృష్ణ దేవుని శిష్యులలో ప్రథముడు

నరేంద్రనాథుడు. వారందరికి నరేంద్రుడు సర్వాదర్శం. వారందరికి పెద్దన్న నరేంద్రుడు. నరేంద్రుడు చెప్పినట్లుగా వారందరూ సన్న్యాసం స్వీకరించటానికి నిర్ణయించుకున్నారు. విరజహోమాన్ని చేశారు. సన్న్యాసులయ్యారు. యథార్థ వైరాగ్యంతో ఉన్నవారే సన్న్యాసులు! గురువు ఆదర్శాన్ని, అనుభవాన్ని గ్రహించి, గురువుయొక్క ఆజ్ఞను మీరనివారే శిష్యులు! గురువులో ఉన్న యథార్థ అనుభవాన్ని ప్రచారం చేసేవారే ప్రచారకులు! ఉత్తమ సత్యాన్ని తెలిపి ఉన్నత స్థానానికి తీసుకొని వెళ్లేవారే గురువులు! నరేంద్రనాథ్ (శ్రీ వివేకానందస్వామి) రాఖాల చంద్ర (శ్రీ బ్రహ్మానంద స్వామి) శశిభూషణ్ (శ్రీ రామకృష్ణానంద స్వామి) లాటూ (అద్భుతానంద స్వామి) గంగాధర్ (శ్రీ అఖండానంద స్వామి) కాళీచరణ్ (శ్రీ అభేదానంద స్వామి) శరచ్చంద్ర (శ్రీ శారదానంద స్వామి) జోగింద్రనాథ్ (శ్రీ యోగానందస్వామి) నిరంజన్ (శ్రీ నిరంజనానంద స్వామి) బాబూరాం (శ్రీ ప్రేమానంద స్వామి) తారక్ (శ్రీ శివానంద స్వామి) తులసీ చరణ్ (శ్రీ నిర్మలానంద స్వామి) గ వారు నూతన నామధేయాల్ని పొంది పరివ్రాజకులయ్యారు. వారలు దేశదేశాలు తిరుగుతూ శ్రీరామకృష్ణుని సర్వధర్మ, సర్వమత, సర్వ ఆదర్శాలను ప్రచారం చేయ సాగారు,

శ్రీరామకృష్ణ దేవుని శిష్యాగ్రగణ్యుడైన శ్రీ వివేకానందస్వామి విద్యలో ప్రథముడు, సాధనలో ప్రథముడు, అనుభవంలో ప్రథముడు. అట్టి వివేకానంద స్వామి పరివ్రాజక చక్రవర్తియై, దేశదేశాలలో పర్యటిస్తూ, పుణ్య క్షేత్రాల దర్శిస్తూ, అచ్చటచ్చట తన సాధనల సాగించు కుంటూ, తన అపూర్వ విజ్ఞాన పూరిత వాగ్ధోరణిచే రాజాధిరాజులనే

పాదాక్రాంతం గావించుకుంటూ, పండిత ప్రకాండుల మన్ననల నందు కుంటూ, క్షేత్రి మహారాజు పంపగా పాశ్చాత్య దేశమున ప్రవేశించి, చికాగోలో జరిగిన విశ్వమత మహాసమ్మేళనంలో పాల్గొని, మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక విశాల విశ్వతోముఖ వైభవాన్ని గూర్చి ఉపన్యసించి, వారి మన్ననల నందుకుని, వారి హృదయాల్ని ఆకర్షించి, వేలాది ప్రజల్ని భక్తుల గావించి భారతదేశ పేరు ప్రతిష్ఠల్ని కాపాడి, వేదాంత ధ్వజాన్ని ఎగురవేసి, 'భారతదేశం పుణ్యభూమి. మా మహర్షులు ఆధ్యాత్మిక సామ్రాట్టులు. ప్రపంచానికి శాంతి భిక్షనిడువారు మా గురువర్యులు. వారెప్పుడూ గురుపీఠాన్నలంకరించువారలే! సర్వతో ముఖ ప్రజ్ఞాధురీణులు. మా మునిచంద్రులు ప్రబోధించేది ధర్మం. ఆ ధర్మం సార్వకాలికమైనది.' అని గంభీరస్వరంతో ప్రబోధించిన ప్రజ్ఞాశాలి. శ్రీ వివేకానందస్వామి ప్రజ్ఞాపాటవానికి, ధైర్యసాహసాలకు, అనుభవానికి, సర్వమత సామరస్యానికి పాశ్చాత్యులు ఆశ్చర్యం చెంది, ఆయన ముందు మోకరిల్లి శిష్యులయ్యారు. అచ్చట ఒక శ్రీరామకృష్ణ మఠాన్నికూడ సంస్థాపన చేశాడు. అనేక మంది శిష్యులు తయారయ్యారు. కొందరు యత్యాశ్రమ స్వీకరణం చేశారు. శ్రీ వివేకానందునివంటి గురువు లభ్యం కావటం వారి పూర్వ జన్మ సుకృతమేమో!

విదేశయాత్ర ముగించుకొని విశ్వవిజేతయై వివేకానందస్వామి భారతదేశానికి తిరిగి వచ్చాడు. ఇక మిగిలిన శ్రీ రామకృష్ణుని శిష్యుల ఆనందాన్ని ఎవరు వర్ణింపగలరు? ధనంతో తులతూగిన దేశం అమెరికా. అక్కడ నివసించినా వానికతీతంగా నివసించగలిగిన వైరాగ్యచక్రవర్తి వివేకానందుడు. ఆయన, బంగారాన్ని మట్టిని ఒకేవిధంగా చూచిన

శ్రీరామకృష్ణదేవుని శిష్యుడుగదా! కాన 'సమలోష్టాశ్మకాంచనః' అయ్యాడు. దైవభక్తి, గురుభక్తి, దేశభక్తి ఆయనలో మూర్తీభవించాయి. భక్తి త్యాగంలో యిమిడి ఉంటుంది. అందువల్లనే ఆయన అశాశ్వతమైన ధనాకర్షణకు అతీతుడయ్యాడు. అది దైవభక్తి! అది గురుభక్తి! అది దేశభక్తి!

కలకత్తాలో అడుగుపెట్టాడు వివేకానందుడు. ఆయనలో ఆవేదన ప్రారంభం అయింది. దేనికి? గురు ఋణం తీర్చుకోవాలనుకున్నాడు. బేలూరులో గాంగాతీరంలో ఒక పెద్ద స్థలాన్ని తీసుకొని, అక్కడ శ్రీరామకృష్ణునికి ఒక ఆలయాన్ని నిర్మించాడు. సన్యాసుల కోసం మఠాన్ని స్థాపించాడు. ఆ మఠానికి తన గురువర్యుని పేరునే పెట్టాడు. ఆ మహనీయుని అనుగ్రహంవల్ల యిదంతా జరిగిందని ఆయన గాఢ విశ్వాసం. ఈ విధంగా గురుపుంగవుని ఋణాన్ని తీర్చుకొనిన యధార్థ శిష్యుడు శ్రీ వివేకానంద స్వామి. కీర్తి ప్రతిష్ఠలకై ప్రాకులాడక, ధన సంపాదనకై యత్నింపక, తన పేరున ఆశ్రమముల నిర్మింపక, నిరాడంబరుడై, శ్రీరామకృష్ణుని సకలాదర్శముల ననుసరించిన వినయశీలి శ్రీ వివేకానంద స్వామి. ఆయనకు ఆయనయే సాటి. గురుశిష్య సంబంధ ప్రాముఖ్యాన్ని ప్రపంచానికి చాటినవాడు ఆ దివ్యమూర్తి.

సర్వ ప్రపంచాన్ని ఉద్ధరింపగలిగిన శ్రీ రామకృష్ణుని ఉపదేశములు పండిత పామరుల హృదయాలలో ప్రవేశించి, సర్వత్రవ్యాప్తిని పొందాయి. చిన్న మాటలలో, చిన్న చిన్న ఉదాహరణములతో వివరింపబడుటచేత ఆ మహోపదేశాలు సర్వులకు ఉపయోగం అయ్యాయి. శ్రీరామకృష్ణుని బోధనా వైశిష్ట్యాన్ని చూద్దాం.

(1) నక్షత్రసమూహం రాత్రి మాత్రమే దృష్టికి గోచరిస్తాయి. అదేవిధంగా భగవంతుడు సహృదయులకు మాత్రమే ప్రత్యక్షం కాగలడు (భగవంతుడు ఉన్నాడా? ఎందుకు కనిపించడు? అని ప్రశ్నించువారికి యిది మంచి సమాధానం.)

(2) ఒక చెరువుకు 4 ఘట్టములున్నవి. ఆ నీటిని తెచ్చుకొనుటకు నలుగురు వ్యక్తులు, నాలుగు భాషలవారు, నాలుగు రకముల పాత్రల దీసికొని, నాలుగు ఘట్టములలోదిగి నీటిని తెచ్చుకొన్నారు. తమిళుడు ఆ నీటిని తన భాషలో 'తన్నీరు' అనియు, ఉత్తర దేశస్థుడు 'పానీ' అనియు. ఆంగ్లేయుడు 'వాటర్' అనియు, ఆంధ్రుడు 'మంచినీళ్లు' అనియు పేరు పేరుగ వచించినా వారందరూ ముంచి తెచ్చినది ఒక్క చెరువులోని నీటినే. ఇచ్చట వ్యక్తి భేదం, భాషా భేదం, పాత్ర భేదమేగాని నీటిలో ఎట్టి భేదం లేదుగదా! అదే విధంగా భగవంతుడు ఒక్కడైనా అయా భాషల, అయా దేశముల, ఆయారూపముల, శివ విష్ణు రామ కృష్ణ సీత ఉమ అల్లా యెహోవా మొదలగు అనేక నామముల వ్యవహరింప బడుతున్నాడు. ఈ విషయాన్నే శాస్త్రం ఒక్కమాటలో 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అని నిర్వచించింది. ఈ సర్వ సమన్వయాన్ని అందరూ చేయలేరు. సకల సాధనల జేసి, సమస్త దేవతల దర్శించి, సకలానుభవముల పొందిన శ్రీరామకృష్ణునికే అది సాధ్యమనటం అతిశయోక్తి కాదేమో! అందువలననే అయన వందనీయుడు, అరాధ్యుడు.

మ॥ జలమేరీతిగ దేశదేశముల భాషాభేదమున్ బట్టియే
జలమంచున్, మరినీరు వాటరని దేశాలన్ప్రవర్తిల్లునో

అల దేవుండు శివుండు విష్ణు యెహోవా యల్లా యను నా నామముల్
గల వాడయ్యు నభిన్నుడనుగద రంగా, రామకృష్ణ ప్రభూ!

3. ఒక గృహస్థు ఒక ముంగిసను పెంచాడు, దాని విశ్రాంతి కై గోడలో ఒక చిన్న గూటిని కట్టించాడు. అది తిరిగి తిరిగి గూటిలోకి వెళ్లాలనుకున్నది. ఎగిరింది. కాని గూటిని చేరలేకపోయింది. దాని యజమాని ఆ ముంగిస మాటి మాటికి నిద్రించటానికి వీలు లేకుండ దాని తోకకు ఒక చిన్నరాయి కట్టాడు. ఆ బరువు క్రిందకు లాగుతూ ఉండటంచేత ఎంత ఎగిరినా ఆముంగిస గూటిని అందుకోలేక క్రిందనే తిరుగుతూ ఉంటుంది. అదే విధంగా మానవుని గమ్యం భగవంతుడు. కాని ఆ మానవుడు కామకాంచనాలనే రాళ్ళను కట్టుకొనటంచేత అవి భగవంతుని చేరనీయవు, ఆ బరువులతోనే సంసారసాగరాన్ని యీదటా నికి ప్రయత్నిస్తాడు. ఆధ్యాత్మిక గమ్యాన్ని చేరటానికికూడా విశ్వ ప్రయత్నం సాగిస్తాడు. కాని యీ బరువులు వాడిని యీదనీయువు, గమ్యాన్ని పొందనీయవు, ఏమి చేయాలనేదే ప్రశ్న. ముంగిస తన తోకకు కట్టిన రాయిని విప్పుకొన లేదుకాని వివేకవంతుడై మానవుడు, ఆ కామకాంచనముల దూరీకృతంచేసికొని ధర్మతత్పరుడైనచో వానికి తప్పక భగవదానందను లభించి, జన్మ సార్థకత నొందించు కొనును.

ఇటువంటి ఉపదేశాలు ఎన్నో శ్రీరామకృష్ణుని ముఖతః వెలువడి, సర్వులకు ఆనందాన్ని కలిగిస్తున్నవి. ఆయన కామధేనువు. ఆయన కల్పవృక్షం. సర్వ వృక్ష జాతులతో, సకల ఫల పుష్ప సంభరితమై, ఎవరేది కోరిన దానిని ప్రసాదింపగల ఆనందోద్యానం. అదియే శ్రీరామకృష్ణోద్యానం. శాశ్వత ఫలాలను ప్రసాదించు ఉద్యానం

ఆ ఉద్యానవనంలో మనంకూడా ఒక్కసారి ప్రవేశించి, ఆయా దివ్య అనుభవ ఫలాలను మనసార భుజిద్దాము.

శాక్తేయంబను సరసును గనుడీ! సర్వ తృష్ణ విచ్ఛేదక తీర్థము
రామప్రసాద కమలకాంతులట అమరుల చందంబాడుచుండిరి.

అదిగో! చూడండి! అక్కడ 'శాక్తేయం' అనే ఒక సరస్సు ఉన్నది. అందులో ఉన్న జలం ఎంత స్వచ్ఛంగా ఉన్నదో! ఆ తీర్థం సమస్త కోర్కెల్ని నశింపజేస్తుంది. అక్కడ సదా దేవీ సాక్షాత్కార లబ్ధులును, పరమ భక్తాగ్రేసరులును, శక్త్యారాధనా తత్పరులును, దేవీ సంకీర్తనామృత పానమత్తులును అయిన రామ ప్రసాద కమలకాంతులు ఆనంద నృత్యం చేస్తున్నారు.

కాంచుడు తాంత్రిక ఘనలత యందము సర్వపాపభయహారక పాశము
భైరవి బ్రాహ్మణి పరమభక్తులకు ఆలవాలమిది విశ్రమస్థానము.

అటు చూడండి! ఆ లత ఎంత చక్కగా అల్లుకున్నదో! ఆహా! పుష్పములతో చూడ ముచ్చటగా ఉన్నది. అదే తాంత్రికలత! అది సర్వపాపాలను, భయాలను హరింపజేస్తుంది. అక్కడ తంత్రశాస్త్ర నిష్ణాతులు, తంత్రశాస్త్ర పారీణులు, తంత్రరహస్య వేత్తలు, 64 తంత్ర శాస్త్ర మర్మముల గ్రహించిన వారును అయిన భైరవి బ్రాహ్మణి మొదలగువారు నివసిస్తున్నారు. బహుశః వారందరూ ఆ యా అనుభవాలను చర్చిస్తున్నారేమో!

రామఫలంబుల రుచి జూచునట కర్మబంధ నిర్మూలముగనుడీ!
మారుతి శబరి కబీరు రామదాసులరుగో! ముక్తులు లోకపూజితులు.

అదేమిటి? పెద్ద వృక్షంలాగ ఉన్నదే! అవును, అది రామఫల వృక్షం. ఆ చెట్టుకు సువాసనాభరితమైన రామఫలాలు వ్రేలాడుతున్నవి, ఆ ఫలాలు భుజించిన సర్వ కర్మబంధాలు నశిస్తాయి. ఆ వృక్షాన్ని ఆశ్రయించి ఆదర్శ భక్తాగ్రేసరుడును, శ్రీరామనామ ధ్యానతత్పరుడును, దాస్యభక్తికి ఆదర్శప్రాయుడును, శ్రీరామునిబంటును అయిన ఆంజనేయుడును: అరణ్యముల తిరిగి తిరిగి, అలసి సొలసి వచ్చిన రఘురామునికి రుచ్యమగు పండ్లను యిచ్చు సంకల్పంతో భక్తి పరవశయై, తాను ముందుగ ఆ ఫలాలను చవిజూచి యిడిన భక్త శబరియు! మతమేదియైనను మనస్సులో భక్తి విశ్వాసాలు ప్రధానం అని భావించి, తన శ్రీరామనామ సంకీర్తనంతో ఎల్లర పరవశుల గావించిన కబీరును: బాల్యంనుండి రామనామస్మరణ గావించుకొనుచు, తనకు లభించిన తహశీల్దారు పదవిని శ్రీరామానుగ్రహంగా భావించి, నిరహంకారియై, భద్రాచలంలో శ్రీరామాలయాన్ని కట్టించి, దానివలన అనేక కష్టాలు ప్రాప్తించినా భక్తిని విడనాడక, తుదకు శ్రీరామ సాక్షాత్కారం పొందిన భక్త రామదాసు మున్నగు మహాభక్తులు నివసించుచున్నారు. వారెల్లరు తాము తరించి, లోకాన్ని తరింపజేసినవారుగదా! అందుచేతనే వారు సదా వందనీయులు.

**అ**ద్వితీయమగు నద్వైతంబను నిర్వికల్పమనకల్పకమిదిగో!
శంకరాదులెపుడు సేవింతురు దీని సర్వకోర్కెలను దీర్చును కోరుడు.

ఇదిగో! ఇక్కడ సర్వకోర్కెలను దీర్చు కల్పవృక్షం ఉన్నది. ఇది అసామాన్యమైన కల్పవృక్షం. నిర్వికల్ప సమాధియను కల్పవృక్షం. ఇది అద్వితీయమైన అద్వైతానుభవంచేత లభిస్తుంది. దీన్ని నిష్కాములే సదా సేవిస్తుంటారు. షణ్మత సంస్థాపకుడు, మేధా

సంపన్నుడు, అద్వైతానుభవమూర్తియు, అపర శంకరుడు అయిన శ్రీ శంకరులు, తదితర అద్వైతాచార్యులును ఆ కల్పవృక్షాన్ని ఆశ్రయించి జన్మరాహిత్యాన్ని పొందియున్నారు. వారంతరూ సదా బ్రహ్మానందామృతపాన నిరతులుగదా!

బౌద్ధ ధర్మ నిర్వాణ ఫలంబుల భాసిలు తరువును చూచితిరా!
ఆనందాశోక నాగార్జున ప్రముఖుల ఆనందాంబుధి మగ్నులజేసెను.

అచ్చట మరొక వృక్షం కనిపిస్తున్నది. అది బౌద్ధమత సంబంధమైనది. ఆ తరువు నిర్వాణం అనే ఫలాలతో నిండి ఉన్నది. ఆ వృక్షంక్రింద ఎవరో కూర్చున్నటున్నదికదా! బౌద్ధ ధర్మానుష్ఠాన తత్పరులై, అష్టాంగముల గ్రహించి, బౌద్ధమత వ్యాప్తికి అవిరళ కృషి గావించిన ఆనందుడు, అశోక చక్రవర్తి నాగార్జునాది ప్రముఖులు వారంతా, శరణత్రియాన్ని ఉచ్చరిస్తూ, బుద్ధుని ధ్యానిస్తూ, ఆనంద మగ్నులైయున్నారు.

క్రైస్తవానుభవ పుష్పరాజయుత వృక్షరాజమిది పరిమళపూర్ణము
పేతురు పౌలు ఫ్రాన్సిసు మొదలగు భక్తులజూడు డున్మత్తతనుండిరి.

ఇదిగో పెద్ద చెట్టు యిక్కడ ఉన్నది. అది క్రీస్తు అనుభవాలనే పుష్పాలతో నిండి ఉన్నది. ఆ పుష్పాలు సువాసనలను వెదజల్లుతున్నవి. ఆ సువాసనల ఆఘ్రాణిస్తూ, పేతురు. పౌలు, ఫ్రాన్సిస్ మున్నగు భక్తులు ఉన్మత్తులై, తన్మయత్వంలో మునిగి ఉన్నారు.

ఇస్లాముమత అనుభవసారము అదిగో థారగ నిలబడుచున్నది.
ఉమ్మర్థయాద్యుత్తమపురుషులు ఓలలాడి పరమాత్మను జేరిరి.

అదిగో! ఆ ప్రవాహాన్ని చూచారా! అది మహాప్మదీయమత అనుభవసారం. అది ఒక ధారవలె ఉన్నదిగదా! ఉమ్మర్‌ఖయాం మొదలైన వారు ఆ ప్రవాహంలో మునిగి ఆనందంతో ఓలలాడుతున్నారు. వివేకానందుని అధ్వర్యంబున పెక్కు మహాత్ములు పాలన జేయుచు ఒక్కొకచోటున ఒక్కొకరుండుచు చక్కగ మనకు చెప్పి యిత్తురవి.

ఇంతకూ యీ ఉద్యానపాలకుడెవరు? ఆయన అధ్వర్యంలోనే యీ పరిపాలన చక్కగా సాగుతున్నది. ఈ ఉద్యానం అనుభవజ్ఞులకు నిలయం. ఇందులో సర్వజాతి వృక్షాలు ఉన్నవి. కాని సర్వమతస్థులు, సకల జాతులు. తమ తమ జాతి వర్ణముల మరచి సమైక్యంలో నివసిస్తున్నారు. ఆయా స్థలముల, ఆయా అనుభవసంపన్నుల నుంచి, వచ్చినవారికి ఆయా వివరముల తెలిసే ఏర్పాటు చేసినవాడు శ్రీ వివేకానందస్వామి.

పై విధంగా సర్వతోముఖానుభవ స్వరూపుడైన శ్రీ రామకృష్ణునికి, సర్వతోముఖ ప్రజ్ఞాస్వరూపులైన శిష్యులు ఏర్పడటం ఆ లోకమాత సంకల్పంకదా! బోధించటం, ఉపదేశించటం, ఉద్ధరించటం అనేవి మానవ సంకల్పం అయితే అవి సక్రమంగా నెరవేరవు. కారణం వారి కర్తృత్వం. కాని ఆ బోధన, ఉపదేశ, ఉద్ధరణములు భగవతి సంకల్పం అయితే, వాని నిర్వహణార్థం ఆమెయే ఆయా గురుశిష్యుల, లోకానికి ప్రసాదిస్తుంది. అప్పుడు ఆ కార్యం నిర్విఘ్నంగా సాగుతుంది. కారణం వారి అకర్తృత్వమే. శ్రీరామకృష్ణుడు అట్టి మహానుభావుడు. ఆయన ధనాన్ని ఆర్జింపలేదు. కీర్తికై తాపత్రయం చెందలేదు. గురువై ఉపదేశం చేయాలనే వాంఛలేదు. ప్రపంచాన్ని ఉద్ధరించాలనే

కాంక్షకూడలేదు. కాని ఆ జగజ్జనని చెప్పినట్లు చేశాడు. ఆమె అయనను శిష్యుడిగా చేసినప్పుడు శిష్యుడే అయ్యాడు. గురువుగా చేస్తే గురువే అయ్యాడు. ఉపదేశం యివ్వమంటే యిచ్చాడు. పరిసంగం చేయమంటే చేశాడు. వద్దంటే మానివేశాడు. ఆయనను శిష్యునిగాజేసి, గురువు లందరిని అక్కడికే రప్పించింది. అయనను గురువుగా ఉంచి శిష్యులందరిని అక్కడికే రప్పించింది. ఆయనను ఉపాసకునిగా జేసి సర్వదేవతల్ని సాక్షాత్కరింపజేసింది. ఆయనను అవతార వరిష్ఠునిగాజేసి, పండితుల్ని, పామరుల్ని, మహాత్ముల్ని, సన్యాసుల్ని అక్కడికే రప్పించింది. ఇటువంటి ఉవ్య వ్యక్తిత్వం ఏ మహాత్మునిలో గోచరింపదు. 'అమ్మా! నేను యంత్రాన్ని. నీవు యంత్రిణివి' అని, అదేవిధంగా ఉన్నవాడు శ్రీరామకృష్ణుడు. ఇదియే శ్రీరామకృష్ణుని పరిపూర్ణ భగవదధీన తత్త్వం! ఇదియే శ్రీరామకృష్ణుని యధార్థ శరణాగతి! ఇదియే శ్రీరామ కృష్ణుని ఆత్మనివేదనా విధానం! ఇదియే శ్రీరామకృష్ణుని ప్రపత్తిమార్గం. ఇదియే శాస్త్రంలో మార్జాల కిశోరన్యాయం! తన వ్యక్తిత్వాన్ని త్యజించటం అనుకున్నంత సులభంకాదు. అది పసిబిడ్డకే సాధ్యం. ఆ పసితత్వాన్నవలంబించి, శ్రీకాళికాదేవికి పసిబిడ్డయైన శ్రీరామకృష్ణ పరమహంస దేవునికే సాధ్యం.

సర్వవిధమ్ముల నీ యవతారము సర్వోత్కృష్టము సర్వాతీతము
సర్వమానవ పుణ్య కారణము నవ్య భారత భాగ్య విశేషము.

ఆచార్యులకు మహాచార్యుడు, అవతారములలో అవతార శ్రేష్ఠుడైనవాడు శ్రీరామకృష్ణుడు. సర్వమానవుల పుణ్యకారణం శ్రీరామ కృష్ణుడు. భారతదేశ భాగ్యవిశేషం శ్రీరామకృష్ణుడు. అట్టి ఓంకార

రూపుడు, జగదాధారుడు, కృపాసాగరుడు. మంగళ ప్రదాతయు నగు శ్రీరామకృష్ణునకు సహస్ర నమోవాకములు.

క్షుదీరామసుపుత్రాయ చంద్రామణి సుతాయచ।
శారదారాధ్యదేవాయ రామకృష్ణాయ మంగళమ్॥

ఆ మహానుభావుని దివ్యమంగళ స్వరూపాన్ని గాంచిన వారికి, అర్చించినవారికి, కీర్తించినవారికి సర్వదా జయము కలుగును గాక।

మ॥ జయ చంద్రామణి పుత్ర। కాళిసుత। శాస్త్రార్థస్వరూపా। హరీ।
జయ సర్వోత్తమతత్త్వ। లోకగురు। సాక్షాత్ సచ్చిదానందమా!
జయ మౌనీంద్ర। నరేంద్రపూజిత। శ్రీ అనుభవానంద ప్రియా।
జయముప్పొంగునుగాక! భక్తులకు నీశా। రామకృష్ణప్రభూ!

హరిః ఓం తత్ సత్



# స్టీరియో క్యాసెట్స్

1. **శ్రీరామకృష్ణగానసుధ:—** శ్రోతల హృదయాల్ని కదిలించి, దివ్యానందానుభూతిని కల్గించు, భక్తి, జ్ఞాన, వైరాగ్యపూరితమైన పాటలు, స్తోత్రములు ఇందు మధురంగా గానం చేయబడినవి.

గీతరచన – శ్రీశ్రీశ్రీ మాతాజీత్యాగీశానందపురి,
శ్రీశ్రీశ్రీ అనుభవానందస్వామి

గాయకులు — శ్రీ M. బాలమురళికృష్ణ, శ్రీ P. సుశీల, శ్రీ M. శారద, శ్రీ G. ఆనంద్, శ్రీ V. రామారావు.

2. **భారతీయ సంస్కృతి - రెండుభాగములు** స్వర విశ్వాన్ని నియమించి, నడిపింపగల మహోన్నతమయిన మన భారతీయ సంస్కృతిని, దాని ప్రాముఖ్యతను తెలియజేసారు ఇందు శ్రీ మాతాజీత్యాగీశానందపురివారు.
శ్రోతలు విని, అర్థం చేసుకుని, ఆచరించి, తమ జీవితాల్ని ధన్యం చేసుకోగలరు.

3. **గీతామృతము - కర్మయోగము** శ్రీకృష్ణునిచే గానం చేయబడిన అద్భుత "భగవద్గీత"లోని కర్మయోగ ప్రాశస్త్యాని, నిత్య జీవితంలో అన్వయింపజేసుకునే విధానాలని హృదయానికి హత్తుకునేలా తెలియజేసారు శ్రీమాతాజీత్యాగీశానందపురివారు.

సంగీతం:— కుమారి M. శారద
వ్యాఖ్యానం:— బ్రహ్మచారి శ్రీ సుధాచైతన్య

4. గీతామృతము: - భక్తియోగము భక్తితో భగవంతుని పొందేవిధానాన్ని శ్రీకృష్ణుడు "భగవద్గీత"లో తెలియజేసాడు. భక్తి మార్గవిశిష్టతను, దానిద్వారా మానవత్వాన్ని జయించి దివ్యత్వాన్ని పొందే మార్గాన్ని శ్రీమాతాజీత్యాగీశానందులవారు తమ అనుభవ పూరిత వాక్యాలద్వారా తెలియజేసారు.

సంగీతం — కుమారి M. శారద

వ్యాఖ్యానం:— బ్రహ్మచారి శ్రీ చైతన్య

5. గీతామృతము - జ్ఞానయోగము ఉత్తమాధికారులు అనుసరించి సాధించదగిన జ్ఞానయోగరహస్యాలూ, వివరాలూ, శ్రీమాతాజీవారి అమూల్య భాష్యము తోగలవు.

సంగీతం:— కుమారి M. శారద

వ్యాఖ్యానం:— బ్రహ్మచారి శ్రీ సుధాచైతన్య

---

అందరూ విని ఆనందించండి.

# త్వరలో మాద్వార విడుదలకానున్న స్టీరియో కేసెట్స్

సాధకులకు, తమ సాధనామార్గములో అత్యంత ఉపయుక్తమగు

1. సాధన రహస్యము
2. సాధన మకరందము
3. సాధన సుధ
4. శ్రీ శంకరాచార్యులవారి భజగోవిందము

మరియు మరికొన్ని భక్తికీర్తనలుగల కేసెట్స్-

మానవుడు వివేకియై, విరాగియై, సాధకుడై, సిద్ధుడు కావాలి. సత్సంస్కారయుతులు అట్టి మహనీయుల ఉపదేశామృతమును గ్రహించి, సాధన చేసి, అనుభవసంపన్నులు కాగలరు. శిక్షణా సామర్థ్యము కలవాడే గురువుకదా!

ఈ లోకంలో మానవుడు ఒక్క సాధనచేసి, అనుభవజ్ఞుడు కావటమే చాల కష్టం. కాని సకల సాధనల గావించి, సర్వదేవతల సాక్షాత్కరింపజేసి కొని, వారిని తనలో లయింపజేసికొని, సర్వానుభవ సంపదల గడించుట సామాన్యులకు సాధ్యమా? ఆ సర్వానుభవానంద ప్రవాహముచే సర్వమత



సామరస్యము. ఆ సర్వమత సమత్వమును మాటలలోగాక ఆచరించి చూపిన దివ్యమూర్తి శ్రీరామకృష్ణ పరమహంస దేవుడు. శ్రీ కాళికామాత అనుగ్రహముచే సర్వము ఆయనకు లబ్ధము. అందువలననే ఆయన జగద్గురువు, అవతార శ్రేష్ఠుడు, యుగావతారము.

ఆ మహాత్ముని బోధనలు సర్వమతస్థులకు, సర్వదేశస్థులకు అత్యంతావశ్యకము. త్రికరణశుద్ధితో ఆయన ఉపదేశముల నాలకించి, పఠించి, సాధనచేయ యత్నించువారికి, ఆయన దివ్యానుగ్రహం తప్పక లభిస్తుంది. ఇది ముమ్మాటికి సత్యం.